# లక్ష్మీపతిగారి అమ్మాయిలు

[10]

రాం షా.

బ్రూ వ్రాసిన త్రీ డాటర్స్ ఆఫ్
మన్‌షూర్ డు పోం ననుసరించి





శామల్‌కోట
కళాకేళీ ప్రచురణలు




సామాజిక జీవితంలో వివాహం అత్యంత ప్రధానమైన సంఘటన. అంతే కాదు, నిత్యనైమిత్తికమైనవైయక్తికజీవితంలో తన ప్రభావాన్ని ప్రస్ఫుటీకరించడమే గాక — బ్రహ్మాండమైన అయోమయ చక్రంవలె పరిభ్రమించే సాంఘికవ్యవస్థా సుగతికీ దుర్గతికీ కూడా వివాహసంస్థ కారణభూత మవడం గమనార్హం!

సాహిత్యం సజీవమైనదైనప్పుడు బ్రతికివున్న సమాజపు దేహాన్నీ ప్రాణాన్నీ సైతం నిష్కల్మషంగా ప్రతిబింబించాలనడం వివాదాస్పదం కానేరదు. కనక సజీవ సాహిత్యాన్ని సృష్టించే రచయిత తననీ — తనతోటి సామాజికులనీ ఒకే రంగు కంటి అద్దాలతో దర్శించి, తన సృజనా వ్యాసంగాన్ని శక్తిమంతంగా కొనసాగించడం ధర్మం. ఆధర్మాన్ని ఈ 'లక్ష్మింపతిగారి అమ్మాయిలు' ఎలా నిర్వర్తించిందో పరిశీలించాలి.

మానవ సమాజంలో ఆదిమ దశనుంచీ వివాహసంస్థస్థాణువులాగ చదికిలబడి ఉందని నేటికీ చదువుకున్న వాళ్ళుకూడా నమ్ముతూనే ఉన్నారు. ఆ నమ్మకం ఎంత పొరబాటో గ్రహించడానికి మన సామాజిక చరిత్రను కనీసం గత రెండుమూడు దశాబ్దాలుగానైనా శాస్త్రీయంగా పరిశీలిస్తే సరిపోతుంది.

రామాయణ భారతాది మహాకావ్యాల్లోను, మన్వాది ధర్మశాస్త్రాల్లోనూ కనిపించే పెళ్ళికీ — నేడు జరుగుతున్న శాస్త్రీయ 'అశాస్త్రీయ' వివాహాలకీ ఎంతభేదం ఉందో విజ్ఞులకు తెలియనిది కాదు. సమిష్టివివాహం, బహుపత్నీత్వం, బహుభర్తృత్వం వంటి పద్ధతులనుంచి నేడు చెలామణీలోవున్న 'ఏకపత్నీత్వం' వరకూ మన పెళ్ళి సమస్యను పరీక్షిస్తే ఒక ముఖ్యమైన సంగతి బోధపడుతుంది. మానవజీవితంలోని అన్ని ప్రధాన విషయాలవలెనే వివాహం కూడా ఆర్థికవ్యవస్థనూ, ఉత్పత్తిశక్తులనూ అనుసరించి పరిణామం చెంది స్థిరీకరింపబడుతోంది. స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యం

## అచ్చుతప్పులకు రెండు మచ్చుతునకలు.

36 వ పేజీ 7 వ పంక్తి : 'మీ పెద్దమ్మ రమ్మంది'
—కాదు; 'మీ పెద్దమ్మ చచ్చింది.'

43 వ పేజీ 27 వ పంక్తి : 'లక్ష్మింపతిగారి'
—కాదు; 'లక్ష్మిందేవి గారి.'

# లక్ష్మింపతిగారి అమ్మాయిలు

## అంకం 1

[ఫిబ్రవరి; సుమారు పాతికవేలు జనాభావున్న ఒక వూళ్ళో ఒక ఇంట్లో ఒక చిన్నగది. ఒక సామాన్యమైన కుటుంబానికి చాలీ చాలని సామానంతా ఉంటుంది. కొంచెం ఇరుకు.

నరసమ్మగారు ఒక్కత్తీ చిరిగిపోయిన చొక్కాలకు మాసికలు వేసుకొంటూ ఉంటుంది. ఒకటి రెండునిమిషాలయ్యాక సుబ్రహ్మణ్యం వచ్చాడు. చేతిలో కొన్ని కాయితాలున్నాయి.]

సుబ్ర— ఏవమ్మా! మీ రొక్కరూ ఉన్నారే?

నర— అవును నాయనా.

సుబ్ర— అమ్మాయిలు ఎక్కడికేనా వెళ్ళారాండి?

నర— అవును నాయనా. ఎవరో పిలిచారని చూడటానికి సరోజ వెళ్ళింది; సుభద్ర గుళ్ళోకి వెళ్ళింది.

సుబ్ర— ఓహో! అలానా!

నర— శనివారంవస్తేచాలు—ఆ భీమేశ్వరస్వామి ఆలయాన్ని ఒక్క నిమిషంకూడా విడిచిపెట్టదు. అదిసరే. ప్రతిరోజూ మూడుగంటలైతే చాలు పురాణంచెప్పే చోటికి పోతుంది. ముక్కుపచ్చలారని వయస్సైనా, ఏమిటో, ఎక్కడా ఇహంమీద కాపీనమే లేదు.

సుబ్ర— ఆవిడికి ఎన్నేళ్ళండి?

నర— ఎన్నోనా నాయనా! మొన్ననే ఇరవైరెండు వెళ్ళి ఇరవైమూడు వచ్చింది.

సుబ్ర— అప్పుడే ఇహసుఖాల కంత విరక్తి కేం వచ్చింది?

నర— చూశావా మరి!

సుబ్ర— ఆవిడ తన తల్లిగుణాల్ని పుణికిపుచ్చుకున్నట్టుంది.

నర— మా సవితిని నువ్వెరుగుదువా ఏమిటి?

సుబ్ర— అవునండి. నాకు బాగా చిన్నతనం. అందరూ చెప్పుకోవటంకూడా విన్నా... లక్ష్మింపతిగారు క్లబ్బులో పేకాడుతూ వుంటారు. అందుకు సందేహం లేదు. నాకుకూడా ఒకసారి వారిదగ్గరికి వెళ్ళే పనుంది.

నర— నువ్వు యిన్నాళ్ళూ కష్టపడ్డావ్ కదా, ఏమన్నా నాలుగురాళ్ళు కూడబెట్టుకొన్నావా ?

సుబ్ర— ఏదో మీ దయవల్ల; అనవసరం ఖర్చుచేసి చేపట్టు పాడుచేసుకోవటమంటేనే నాకు భయం. అదేమిటమ్మా, మీరుకూడా కష్టపడుతున్నారు ?

నర— ఏవో చినిగిపోయిన బట్టలుంటేను, ఎవరికైనా ఇవ్వవచ్చుకదా అని, మాసిక లేస్తున్నాను. ఊసుపోకకైనా కొంతపని చేయాలికదా ! ... అవును కాని సుబ్రహ్మణ్యం ! ఉత్తరాలేమైనా వొచ్చాయా ?

సుబ్ర— ఒక కేటలాగు, ఒక ఉత్తరం వచ్చాయండి.

నర— ఎవరన్నా పుట్టారా ! లేక చచ్చారా ?

సుబ్ర— కాదమ్మా ! పెళ్ళి ఉత్తరం.

నర— ఏదీ, ఇలా తే. [చదివింది.] సోమసుందరం ! సోమసుందరమా ? శా గ ద యెవరు చెప్మా ?

సుబ్ర— అబ్బో, ఆమె చాలా అందగత్తెని కాలేజీ కుర్రాళ్ళంతా అనుకుంటూంటారు.

నర— ఓహో ! అవునవును. ఈ వుత్తరం మా సరోజకి చూపిస్తాను. [ఆగి] అన్నట్టు, నువ్వేదో నవల రాస్తున్నావని విన్నాను; పూర్తయిందా ?

సుబ్ర— ఇంకా ఏదండీ! [కూర్చొని] ఇంచుమించు పదిహేనేళ్ళబట్టి ఆలోచిస్తున్నాను. కథ యెలా ముగించాలా అన్నది నిన్ననే తట్టింది : నవల రాయటమంటే సామాన్యం కాదు కదమ్మా !

[సుభద్ర ప్రవేశిస్తుంది. సన్నంగా పొడవుగా వుంది; గొప్ప అందమూ ఆకర్షణా ఆమెలో లేకపోయినా, సంసార పక్షంగా వుంది.]

నర— ఆగావేం? పరవాలేదు, చెప్పు; మన సుభద్రేలే ... యింతకీ నీ కథ యేమిటో చెప్పావే కాదు.

సుబ్ర— ఏదీ ఇంకా ఒహూపట్టాన తెమలందే ! [లేచి నిలబడి నమస్కరిస్తూ] నమస్కారం సుభద్రగారూ !

సుభ— [చిరునవ్వుతో] నమస్కారం.

నర— ఎంచాతనో చాలా సంతోషంగా వున్నావు ?

సుబ్ర— అవును; నిజంగానే.

సుభ— మీ నవల పూర్తయిందా ఏమిటి ?

సుబ్ర— అవునవును. మీకెలా తెలిసింది ?

సుభ— [తొట్రుపాటుతో] అహాఁ; ఏమిటో—

సుబ్ర— ఏమిటో ?

సుభ— [గాద్గదికంగా] అహాఁ; అలా తెలిసింది.

సుబ్ర— మీకూ తెలిసిందీ ?

సుభ— అవును. అయినా ఫరవాలేదు లెండి.

నర— అయితే త్వరలోనే పేరూ, పేరుతో బాటు డబ్బూ—

సుబ్ర— అలాంటిదేమీ లేదండీ. నా పుస్తకాన్ని అచ్చు వేసేవారు అయినా దొరుకు తారని నాకు నమ్మకంలేదు. ఎక్కడో అప్పుచేసి మనమే అచ్చువేసుకోవాలి. అయినా అవన్నీ ఆలోచించటానికి ఇంకా కావలసినంత టైముంది; ఏదో రాయాలనే ఆకాంక్ష మాత్రమే కాని అంతకన్న వేరే ఆశలేదు... యింక నేను వెళ్లివస్తానండి.

నర— వెడతావా ?

సుబ్ర— వెళ్ళొస్తానండి.

నర— సరే వెళ్ళిరా నాయనా.

సుభ— వుంటానండి.

[సుబ్రహ్మణ్యం వెళ్ళిపోయాడు]

నర— అతను పుస్తకం వ్రాశాడని నీకెలా తెలుసు ?

సుభ— [కంగారు పడుతుంది. కొంచెం తేరుకొని] ఎవళ్ళకీ చెప్పకే పిన్నీ !

నర— చెప్పనులే.

సుభ— అతని పుస్తకం పూర్తయితే వెంకటేశ్వర్లుకు దీపారాధన చేస్తానని దండం పెట్టుకొన్నాను.

నర— [పూర్తిగా కాకపోయినా కొంత అసూయతో] ఓహో ? [సరోజ వచ్చింది.]

సరో— అమ్మా !

నర— వచ్చావా నా చిట్టితల్లీ ! రా అమ్మా రా. ఎవరింటి కెళ్ళావమ్మా ? [సుభద్ర మీద తనకున్న ముభావాన్ని, సరోజ మీద తనకున్న అభిమానాన్ని స్పష్టం చేస్తుంది.]

సరో— భావాయమ్మారావు గారింటికి వెళ్ళానమ్మా.

నర— అలాగే అనుకున్నాను,

సరో— ఎందుకనుకున్నావే అలా ?

నర— నువ్వు పిల్లలంటే చెవికోసుకుంటావని నాకు తెలుసునమ్మా. భావాయమ్మారావు గారికి ఆరుగురు పిల్లలు కదా అని—

సరో— ఆవిడ ఎంత అదృష్టవంతురాలో ! చూడు, వాళ్ళ భావనరావు : నీకు తెలుసుగా, అతనుపుట్టి ఆర్నెల్లన్నా కాలేదా—

నర— అవును.

సరో— ఎక్కడా ఎరమరిక లేదేవ్! నేనంటే ఉరకలు వేసుకొంటూ మీద పడతాడు.

నర— నువ్వే తల్లివైనట్టు.

సరో— చిన్నారావు అదే అల్లరి ! బుచ్చిబాబూ, భావనారాయణ దెబ్బలాడుకొని చిక్కుముంహాలు పెట్టారు. వాళ్ళనేమీ అనకండని వాళ్ళ అమ్మగార్ని బ్రతిమలాడాను. అది సరే అనుకో...ఏమే, అమ్మా, రేపు రాళ్ళబండి వారి యింటికి వెళ్ళొద్దుటే ? పాపం, వాళ్ళ సూరిబాబుకు ఒంట్లో యెలా ఉందో ?

నర— ఇంక నాలుగు రోజులు పోతే నీకే పిల్లలు పుడతారులే.

సరో— [సిగ్గుగా] పోదూ !

నర— ఏం సుభద్రా ! అలా నోరెళ్ళ బెట్టుకు కూర్చుని ఏం చేస్తున్నావ్ ?

సుభ— మీ కబుర్లు వింటున్నాను.

నర— ఆ బొమ్మకి రంగు వేయటం అయిందా ?

సుభ— నాలుగు బొమ్మలకి పూర్తయింది. ఇంక గోపికావస్త్రాపహరణానికి వెయ్యాలి.

సరో— బలే బలే. సుభద్రకి గోపికా వస్త్రాపహరణం !

సుభ— ఏం ?

నర— రేపు మధ్యాహ్నంలోగా అన్నీ పూర్తయిపోవాలి. తెలుసా ?

సుభ— అలాగే.

నర— అలా గోళ్లుగిల్లుకుంటూ యెదురుగుండా కూర్చోకపోతే అదేదో కాస్త చూడరాదుటే ?

సుభ— రేపు పొద్దున్నే లేస్తాలేవే.

నర— నువ్వెంత పొద్దున్నే లేచినా...

సుభ— ఆరుగంటలకల్లా లేచి పూర్తిచేసేస్తానులే.

నర— ఊరికినే కూచుని ఏదో సొల్లుకబుర్లు చెప్పకపోతే ఏదో కొంత పనన్నా చేయకూడదా ?

సుభ— పోనిస్తూ.

నర— ఇవాళ శనివారంకదూ? అందుకని రాణీగారు ఏపనీ ముట్టుకోరు కామాలు !

సుభ— పోనిస్తమ్మా, రేపు చేస్తానన్నాగా...

నర— నీ ఇష్టం వచ్చినట్టు చెయ్యి. నీకూ పాతికేళ్లు వచ్చాయి; చిన్నదానివీ చిలిపిదానివీ కాదు.

సరో— [ఏదో కథ చదువుతూ] అమ్మా, ఆఫీసులో సుబ్రహ్మణ్యం ఉన్నాడే ? దీని తరవాతి భాగం చదవాలి.

నర— ఆయన అచ్చువేసే కథలన్నీ చదవొద్దని నాన్నగారు చెప్పారుగా ? యిలా చదువుతున్నావని తెలిస్తే ఆయనకు కోపం వస్తుంది.

సరో— ఇది ముందు వినవే; కథ ఇక్కడికి ఆపు చేస్తే ఏం బావుంటుందో చెప్పు ? [చదువుతుంది.] "రవణమ్మ ఇంకా జానకిరాం చేతుల్లోనే వుంది. యింతలో ఆమె భర్త వచ్చాడు; ఆ దృశ్యం కళ్ళారా చూసి అతను నిలువెల్లా మండి పడ్డాడు. గుడ్లు పెద్దవి చేసి చేతిలో రివాల్వర్‌తో ముందు కురికాడు." ఆ తరువాత ఏంజరిగిందో నాకు తెలియద్దూటే.

సుభ— తెలియటానికేముంది ? ఆమె భర్త వాళ్ళిద్దర్నీ ఖూనీచేసి వుంటాడు.

సరో— అలానా !

సుభ— తగిన సాక్ష్యం వుంటే చట్టం అందుకు సమ్మతిస్తుందిటకూడా.

సరో— అబ్బే, అదేం న్యాయం ? ఇంతకీ ఆమెభర్త వచ్చేముందు వాళ్లెలావున్నారో మళ్ళీ చదువుతాను. ఆ ఘట్టం ఎంతో బావుంది. [చదువుతుంది.] రాత్రి వెన్నెట్లో సన్నజాజి పొదలప్రక్క "చిక్కని ఆకాశపు నీలిమ క్రింద మినుకు మినుక్కుమనే నక్షత్రాల కాంతుల్లో, నిద్రపోతున్న సముద్రం ఒడ్డున గుమ్మని సన్నజాజి సువాసనలు మత్తెక్కిస్తూవుంటే, వెలుగు చీకట్లలా పరస్పరం విలీన మైపోతూ ఆ రవణమ్మా, ఆ జానకిరాం—"

నర— [నవ్వుతూ] ఆ చెత్తంతా నీ మనస్సును పాడుచేస్తుంది. అదీ మీ నాన్నగారి భయం.

సరో— నేనేమన్నా ప్రమాదం తెస్తున్నానా ?

నర— అదికాదమ్మా, ఏమైనా ఈ నవలలు చదవటం మంచిదికాదు.

సరో— వాళ్ళ చిట్టి అన్ని కథలూ చదువుతుందిగా. వాళ్ళ చిట్టి నాకంటే చిన్నది కాదుటే.

నర— వాళ్ళ చిట్టికి పెళ్ళయింది.

సరో— జీవితాంతం చిన్నపిల్లలుగా వుండకుండా వుండాలంటే తప్పక పెళ్ళిచేసుకోవాలన్నమాట; నాకు పద్దెనిమిదేళ్ళు; అయినా పధ్నాలుగేళ్ళ చిట్టి చదివే కథల్ని నేను చదవకూడదు కాబోలు !

నర— అన్నట్టు ఏదో చెప్పాలనుకుని మరచిపోయానమ్మా. ఆఁ—సుభద్రా ! బుక్కపల్లి వాళ్ళకు ఇచ్చేశావా ?

సుభ— ఆ.

నర— మట్టపల్లి వాళ్ళకి ఎందు కివ్వలేదు ?

సుభ— పాతవాళ్ళకి మనమీద నమ్మకం వుంటుందికదా అని.

నర— కాస్త యెక్కువధర పెట్టేవాళ్లెవరూ లేరా ?

సుభ— వూరంతా గాలించినా ఎక్కువ సొమ్మిచ్చే దాతలేడు.

సరో— ఓయి దేముడా ! [నిట్టూర్చి] నాకు తగ్గ సంబంధమే దొరకలేదా మీకు ?

సుభ— [నవ్వి] నీకెలాంటి వరుడు కావాలో చెప్పు ?

సరో— నాపని ఎలావుందంటే, దారినపోయే దానయ్యా, నన్ను పెళ్ళిచేసుకోవా అన్నట్టుంది. నా కెలాంటివాడు కావుంటాడో మీరే ఆలోచించాలి. [నవ్వుతూ] నామాటకేంగాని, నీకెలాంటివాడైతే నచ్చుతాడో చెప్పు. నీకైతే డబ్బున్నవాడు కావాలా, కవి కావాలా ?

సుభ— నేనసలు పెళ్ళిచేసుకోనుగా.

సరో— చేసుకొంటే మాట.

సుభ— అయితే చెప్తావిను; ఆరోజు కారోజు పనిచేసుకు బ్రతికేవాడైతేచాలు. అలాంటివాడికి పవిత్రమైన ఆశయాలుంటాయి. తన్ను కట్టుకొని తనకోసం వచ్చినదాన్ని సుఖపెట్టడానికై యెలాంటి త్యాగాన్నైనా అతడొక్కడే చేయగలడు.

నర— నవలలోలా చాదస్తంగా మాట్లాడకు.

సుభ— లేదే.

నర— నా కెక్కడో చదివినజ్ఞాపకంఉంది. అవునా, అందులోనూ నీ వయస్సులో పరాచికానికైనా అలాంటిమాటలు రాకూడదు.

సరో— ఏమే! అమ్మా! నీకు సూర్యకాంతం తెలుసుంగా?

నర— తెలుసు.

సరో— దానికి పెళ్లట.

నర— ఓహో!

సరో— అవును. [సాలోచనగా] నేనే ఆఖరిదాన్ని.

నర— ఆఖర్నయితేనేమే పిచ్చిపిల్లా ! ఆఖర్నే ఆణిముత్యాలు దొరుకుతాయి. అబ్బ! ఈ వారం ఆదేమిటో పెళ్ళిళ్ళు డబడబ లాడిపోతున్నాయి ... ఇందాకా సుబ్రహ్మణ్యం ఒక శుభలేఖ తీసుకొచ్చాడు. అది నీకోసానికని ఉంచాను, ఇదిగో.

సరో— [చదివి, విచారంగా] అయిపోయింది!

నర— ఆదేవిఁటే ?

సుభ— అదేం సరోజా?

సరో— ఏమీ లేదు. [అందరూ నిశ్శబ్దంగా పోయారు. సరోజ అంతకన్నా ఏమీ చెప్పలేక, ముఖంలో బాధని దాచుకొంటూన్నట్టు కనిపించింది. ఇంక ఎవరూ మాటాడరు, కొంత సేపటికి] ఆడపిల్లలకి ఈ ప్రపంచం మరీ ఘోరంగా ఉంది.

[ లక్ష్మింపతి వచ్చాడు ]

లక్ష్మిం— [ఆయాసంతో ఒగర్చుకొంటూ వస్తూనే] ఇదిగో. అమ్మాయిలూ, ఒకసారి మీరంతా లోపలికి వెళ్ళిపోవాలి. అవసరమైతే నేనే పిలుస్తాను మిమ్మల్ని.

[ సుభద్ర, సరోజ వెళ్ళిపోయారు. ]

నర— ఏమిటండీ, అంత ఒళ్లో పెట్నా దళ్లో పెట్నా అంటూ వచ్చారు?

లక్ష్మిం— జరుగుమిల్లి శీతారామయ్యగారూ, బాపనమ్మగారూ వస్తున్నారు.

నర— అలానా?

లక్ష్మిం— ఎందుకొస్తున్నారో నీకు తెలుసా!

నర— తెలియదండీ.

లక్ష్మిం— సరోజని చూసుకోటానికని. ఈసారన్నా తెలిసిందా?

నర— వాళ్లబ్బాయికా?

లక్ష్మిం— అవునోయ్ నాయుడూ! టర్కీసుల్తాన్ కోసం కాదు.

నర— వాళ్లు డబ్బున్నవాళ్ళేనటగా?

లక్ష్మిం— తమరు కాస్త తమాయించాలి మరి. అప్పుడే సంతోషానికి పట్టపగ్గాలం లేకపోతే ఎలా? అప్పుడే అయిందా? కావలసినంత గ్రంథం ముందేవుంది. మొన్న క్లబ్బులో శీతారామయ్యగారు కనిపించి సరోజను గురించి అవీ ఇవీ వాకబుచేశారు. అన్నీ ఆడగనిచ్చాను. ఇవాళే ఆడపిల్లల పెళ్ళి ప్రస్తావన వచ్చి, ఈరోజుల్లో పెళ్ళిచేయటమంటే ఎంతకష్టమో చెప్పుకొన్నాం. 'అవును. నిజమే మరి. పెళ్ళిచేసిచూడు, ఇల్లుకట్టిచూడు అన్నారు పెద్దలు' అన్నాడు. 'మాసారూ? మీకు తెలియనిదేముంది చెప్పండి?' అన్నాను. కాస్సేపు అలాగే ఆయన నాకేసి నిదానంగాచూసి 'నేనూ, మా ఆవిడా ఒకసారి మీ ఇంటికొచ్చి మీ దంపతులతో కాస్త పిచ్చాపాటీ మాట్లాడదామనుకుంటున్నాం' అన్నాడు. చల్లకొచ్చి ముంతదాచడమెందుకు, ఇందుకే అనుకోండి'— అనికూడా అన్నాడు, ఇంక చెప్పరా నాయనా, నా సంతోషం! పూర్తిగా చెప్పనిచ్చాను. అలా అని వెర్రిమొహం వేసుకొని కూర్చున్నా ననుకోకు. 'ఏం ఇష్టం; తీరుబడిచేసుకొని, ఎప్పుడో ఓ సారి రండి. ఎప్పుడొచ్చినాసరే!' అన్నాను. చాలా వెంకితనంగా అన్నానులే, 'శుభస్య శీఘ్రం' అన్నాను; 'ఇవాళే వస్తాం' అన్నారు. నేనుమాత్రం తక్కువ తిన్నానా? 'ఆలస్యం అమృతం విషం; మీదయ;' అన్నాను. 'ఆరు గంటలకి పంపమివస్తుంది,

నాలుగున్నరకి వర్షాలు పోతాయి; అరింటికల్లా వస్తాం' అన్నారు. 'తప్పకుండా రండి' అన్నాను. — ఈసారి ఏమంటావ్?

నర— వాళ్ళబ్బాయి పేరేమిటీ అన్నారు?

లక్ష్మిం— నాగేశ్వర్రావు.

నర— అతను మన సరోజకు తగుతాడా, అని.

లక్ష్మిం— నీ ఉద్దేశం గ్రహించకపోలేదులే; అయితే జీవితమంతా ఒక్కలాగే ఉంటారుటే? అమ్మాయి కాపరానికి వెళ్ళగానే అతనే బుద్ధిమంతుడవుతాడు.

నర— అది సరేలెండి; ఏమో, ఏమైనా.

లక్ష్మిం— అలాంటి చెత్తవిషయాలే ఆలోచించవద్దంటున్నాను. ఏదో ఏడుస్తాడు; దానికంత ఆలోచనదేనికి ? ... ఇంతకన్నా ముఖ్యమైన విషయం ఇంకొకటుంది. దాన్నిగురించి ఆలోచించనేలేదు నువ్వు; అసలు ముఖ్యమైన వాటిని గురించే ఆడాళ్ళు పట్టించుకోరు. ఛస్ !

నర— డబ్బుసంగతా? వాళ్ళకిప్పుడు చిల్లిగవ్వకూడా లేదట ఎప్పుడో ఓ రోజున శ్రీరామరక్ష చుట్టేస్తారు.

లక్ష్మిం— అవుననుకో. కాని, వాళ్ళ అన్నగారున్నాడు చూశావ్రా — ఎవరు ?— మన నాగేశ్వరరావు పెత్తండ్రి ... ఆయనదగ్గర పాతిక ముప్పై వేలదాకా ఉన్నాయిట. మళ్ళీ చిల్లిగవ్వ ఖర్చుపెట్టడట — దొంగముండాకొడుకు!— ఎప్పుడో బుడుంగుమంటాడులే.

నర— అవుననుకోండీ, కాని—

లక్ష్మిం— కానీ, కానీ. కానీ, కానీ,— తేరగావస్తే ఎన్ని కానులన్నా ఇస్తావ్, నీకు తోచిందంతో అంతే. చెపితే వినవ్; తిడితే ఏడుస్తావ్. నిన్నని ఏంలాభం ! అసలీ ఆడజాతే అంత.

నర— ఆ ఆస్థంతా ఇతగాడికే వస్తుందనే నమ్మకమేమిటండీ ?

లక్ష్మిం— ఆచంద్రార్కాన్నంతా మనం తిప్పతాంమురా నాయుడూ ! మనల్ని కాదని బహ్మదేవుడయినా అపగింజ సృష్టించలేడు తెలుసా? అది అలాఉంచు, ఆయన ఉద్యోగమేమిటో తెలుసా ?

నర— కలెక్టరేట్‌లో హెడ్డు గుమస్తా కదండీ ?

లక్ష్మిం— రైటో, దానితో ఓటర్ల లిస్టులూ, మిగతా అచ్చు పనులూ అన్నీ మనకే తగులుతాయి, సంవత్సరానికి చచ్చు పాతిక వేల రూపాయల పనుంటుంది. అంటే మన కెంత లాభమో తెలుసా ?

నర— ఐదు వేలుంటుందేమో.

లక్ష్మిం— ఓరి పిచ్చి నాయుడూ, ఐదు వేలా ? చచ్చు ఐదువేలం. కనీసం పదివేలనుకో. మామూలు టెండర్లకే ఆ మాత్రం లాభంఉంటోన్నప్పుడు ఇంక గవర్నమెంటు టెండర్లెందుకూ మనకి ?

నర— వాళ్ల అబ్బాయి గుణం మంచిది కాదని వినికిడి.

లక్ష్మిం— వాడి గుణాగుణాలు ఎలాంటివో ఎవడికన్నా తెలిసి చచ్చును కనక నా! ఇదిగో పులంటే అదిగో తోకంటారు. నిజానిజాలు ఆ పరమాత్ముడికి తెలియాలి. అతని కున్న సుగుణ మల్లా ఒక్కటే. ఆ సంగతి ఢంకా బజాయించి చెప్పవచ్చు—అది ఆ పెత్తండ్రి కతను అభిమాన పుత్రుడు కావటమే. అదీ కాక, ఆ పెత్తండ్రి పీనుగమనకి సాలీనా పది పదిహేను వేల ఆదాయం. చూపిస్తాడు.

నర— నాకంటే మీకే బాగా తెలుస్తాయి ఇలాంటి విషయాలన్నీ.

లక్ష్మిం— అలాఅన్నావ్ బాగుంది. [గడియారం కేసి చూస్తూ] అప్పుడే అయిదూ పదయింది. వాళ్లు ఘడియో అరఘడియో వచ్చేస్తారు ... సమయం వస్తే మన బుర్రబలేగా పనిచేస్తుందిలే. [కుర్చీకి జార్లబడి, చేతుల మీద ఆనుకొని] నీకు సంగతులన్నీ పూసగుచ్చినట్టు చెప్పాను. అప్పట్లో నువ్వెలా నడుచుకోవాలో నీకే అర్థమవుతుంది. సరోజ నాగేశ్వర్రావుల ఆస్థి పాస్థులన్నీ ఇద్దరూ సమంగా అనుభవించేలా సీతారామయ్యగారిని మనం ఒప్పించాలి.

నర— మనం ఆడ బిడ్డకు పెట్టుకొనే సొమ్ము వాళ్లకెలా ముట్టుతుందండీ?

లక్ష్మిం— నువ్వు పానకంలో పుడకలా మాటిమాటికీ అడ్డం పడుతూంటే తెల్లారిపోతుంది. వాళ్లిద్దరికీ ఉమ్మడి ఆస్థి — నాగేశ్వర్రావు పెత్తండ్రిగారి ఆస్తేనన్న మాట — తెలిసిందా?

నర— ఆ.

లక్ష్మిం— అమ్మయ్య! బతికేనురాబాబూ, అప్పుడు — మనం...

నర— రాతకోతలేమీ అఖ్ఖర్లేదంటాం,

లక్ష్మిం— వెధవ తెలివి ఏడ్చినట్టుంది; రాతకోతలన్నీ ఖచ్చితంగా జరిగి తీరాలంటాం.

నర— అబ్బ, అలాచికాకు పడతారేమిటండి?... కాని—

లక్ష్మిం— తగుదు నమ్మా అని సలహాలకు దిగకు. నోరు మూసుకొని నేను చెప్పింది విను చాలు; అందులో ఒక్క అక్షరం కూడా అర్థం చేసుకో అఖ్ఖర్లేదు. [కుర్చీ మీంచిలేచి, కుర్చీని యథాస్థానంలో పెట్టి, ఆమె భుజాన్ని తట్టుతూ] ఇలాంటి విషయాల్లో “మాకివి కావాలి; అవి కావాలి” అని ముక్కుసూటిగా నీ గొంతెమ్మ కోరికలన్నీ అడక్కూడదు. నీకు కావలసిన దాన్ని వాళ్లంత వాళ్లే చేస్తామనేటట్టు చెయ్యాలి. మనం “సరే” అని అంగీకరించి సట్టుగా నటించాలి. తెలిసిందీ?...మన సరోజకు ఐదు వేలు కట్నం చెపుతున్నాను.

నర— ఐదు వేలే! దాని పేర రెండు వేల ఐనొందలే బ్యాంకులో ఉన్నాయి కదండీ.

లక్ష్మిం— ముందీ పాతిక వొందలూ ఆమె కిచ్చేసి మిగతాది పై సంవత్సరం ఇస్తానని చెప్తాను.

నర— ఎందు కొచ్చిన మాటల్లెండి. మీరు చేస్తానన్నవి ఒక్కటన్నా చేశారు గనకనా? నాకు జిగినీ గొలుసు చేయిస్తానని—

లక్ష్మిం— ఎవళ్ళకి తెలుసు? రేపే గవర్నమెంటు కంట్రాక్టు రావచ్చు.

నర— ఇంతకీ పిల్లది ఏమంటుందో? దాని అభిప్రాయంకూడా కనుక్కోవాలిగదా; ఈడొచ్చినపిల్ల అయ్యాక —

లక్ష్మిం— ఆదేదో త్వరగాకానియ్; ఇంక టైంలేదు.

నర— [తలుపుదాకావెళ్ళి వెనక్కితిరిగి వస్తుంది.] ఏమండీ, మీరన్నీ —

లక్ష్మిం— ఆఁ. అన్నీ ఆలోచించాను.

నర— మన సత్యవతిమాట —

లక్ష్మిం— [సగర్వంగా] అది నా కడుపున చెడబుట్టింది. అది నాకు కూతురేమిటి?

నర— అయినా ఆసంగతి పెళ్ళివారితో చెప్పాలిగా.

లక్ష్మిం— చెపుతాం. దానికేఁ? అయినా ఈ సంగతంతా వాళ్ళకీ తెలుసు.

నర— మొన్న కాకినాడలో కనిపించిఁది ఆవిడే ననుకుంటానండీ.

లక్ష్మిం— నీ మొహం. ఆదేం కాదురా నాయుడూ. అది అయినా కాకపోయినా, ఏమీ ఎరగనట్టు నటించడమే మన విద్యుక్త ధర్మం. అలానటించి నిర్భయంగా తలెత్తుకు తిరగగలం ... ముందు సరోజనిపిలు; ఈ గదిని కాస్త సర్దిపెటుతుంది.

[నరసమ్మగారు బైటికివెళ్ళింది. లక్ష్మింపతి దీర్ఘంగా నిట్టూర్చాడు. మళ్ళీ నరసమ్మగారూ, సరోజ వచ్చారు.]

సరో— పెళ్ళివా రొస్తున్నారా, నాన్నా?

లక్ష్మిం— అవునమ్మా, [భార్యతో] ముందా టేబిల్ క్లాత్ మార్చేయ్. [కూతురుతో] మన జరుగుమిల్లివార్ని ఎరుగుదువ్ కదమ్మా. వారి అబ్బాయ్ నాగేశ్వరరావు...

సరో— అవును నాన్నగారూ.

లక్ష్మిం— కుర్రాడు బాగానేఉంటాడుకదూ? ... తొందరపడక ఆలోచించుకొనే సమాధానం ఇయ్యి. చూడు; ముందు నువ్వుకూర్చున్నకుర్చీ గలేబువిప్పి మీ అమ్మ చేతికియ్యి.

సరో— అమ్మా, అమ్మా! వాళ్ళంతవాళ్ళే వస్తామన్నారా, లేక నాన్నగారే వాళ్ళని రమ్మన్నారా?

నర— ఏమోనమ్మా, ఏంజరిగిందో.

లక్ష్మిం— [ఇంకో కుర్చీగలీబును తనే విప్పేస్తూ] ముందివన్నీ తీసెయ్. [నరసమ్మ బైటకు వెళ్ళింది] అమ్మాయిని చూసుకోటానికి వస్తామని మామూలుగానే అన్నారు. ఇంకోగంటలో తాంబూలాలు కూడా తీసుకోంటాం.

సరో— అందుకా మీరంత శ్రమపడుతున్నారు నాన్నా ?

లక్ష్మిం— ఆ; అక్షరాలా అందుకే; మనం అడుక్కు తినే వాళ్ళల్లా కనిపించ కూడదని. మన వంశ మర్యాదని కాపాడు కోవాలికదా. చూడు; ఆమురికి బట్టలు విప్పేశేయ్ ముందు. అవసరాల వారింటికెళ్ళి వాళ్ల అమ్మాయి జార్జెట్ చీర అడిగి తెచ్చుకో, మా నాన్న ఇట్లాంటిదే కొంటానన్నాడు; చూస్తాను తెమ్మన్నాడని చెప్పు. అంతే కాని పెళ్ళి వారొస్తున్నారని చెప్పక. [అంతలో నరసమ్మగారు వచ్చింది.] ఏమిటే, ఆజిడ్డు మొహం నువ్వూను. ముందు ఇన్ని సబ్బునీళ్ళు నీ మొఖానికి తగలేసుకురా. ఇంటిని చూడు, ఇల్లాలిని చూడమన్నారు. దీనికి కాస్త తలదువ్వి జడవెయ్యి. ఈ వెధవ కుర్చీలు; తీసెయ్ వీటిని. కాస్త తివాసీ లన్నా తగలెయ్. [నరసమ్మగారు కుర్చీతో వెళ్ళిపోతుంది.] అమ్మాయీ. నిన్నేమీ బలవంతం చేస్తున్నాననుకోక. నీఇష్టం

సరో— కాని—

లక్ష్మిం— ఏమిటికాని ? ముందు ఈ దీపం వెలిగించీదాకా ఆగు. [చిమ్నీపైకి తీసి హరికేన్ ముందు అగ్గి పుల్లగీస్తాడు,]

సరో— ఇంకా చీకటి పడందే నాన్నా.

లక్ష్మిం— ఒక మూల పెళ్ళివారొస్తొంటే చీకటి పడేదాకా ఎవరు కూచుంటాడు; అయ్యి వచ్చేదాకా అమావాస్య అగుతుందేమిటి ? వెధవ కిరసనాలు ! [కోపంతో దీపాన్ని ఒక సారి హెచ్చించి వెంటనే తగ్గించేస్తాడు.] వెధవ దీపాలు! ఆడముండలు చెయ్యాల్సిన పని మగ వెధవలకి తగులు కుంటే— ఆఁ, అన్నట్టు ఏమిటో అంటున్నా నమ్మాయీ— ఆఁ; కష్టసుఖాలు, సాధక బాధకాలూ అన్నీ నువ్వేఆలోచించు కోవాలి. వివాహంఅంటే.-[ఒకసారి చుట్టూ చూసి] ఇంకా తివాచీ అన్నా తేలేదు చూశావా చచ్చుపీనిగ ! ఏమే, ఏం చేస్తున్నావ్ ? ఏమిటా చిలక్కొయ్యని ? సుభద్ర చీరకాబోలు ! వెధవ ముష్టి చీరా అదీని.

నర— [తివాచీ మోసుకొస్తుంది.] చచ్చాను బాబూ మొయ్యలేక. దీన్నిపరిచి కాస్త—

లక్ష్మిం— సరేలే. [సుభద్ర చీరతీసి, తనే అందిస్తూ] ఇది ముందు తీసికెళ్ళి అవతల పారెయ్. పరిచి పోకుండా రెండు పేము కుర్చీలుకూడా తెప్పించు. [నరసమ్మగారు బైటికి వెళ్లింది.] అమ్మాయి! కష్టసుఖాలు, సాధకబాధకాలు— పోరికిందీ. ఆఁ... ఈ మూల హార్మనీ తీసి అటుచాప పరిచి దాని మీద పెట్టు. [నరసమ్మగారు కుర్చీలు తెచ్చింది.] బస్. ఇక్కడోకుర్చీ, అక్కడో

కుర్చీ; ఇక్కడ పడక కుర్చీ; ఈ తివాచీ బట్టతల ? అక్కడో తలగడా వేదాం. సరే. ఠీక్ హై. ఆఁ; అమ్మలూ, కిందకెళ్లి ఒకడజను స్పెన్సర్ చుట్టలు తెప్పించమన్నానని సుబ్రహ్మణ్యంతో చెప్పు. [సరోజ, నరసమ్మ వెళ్లారు.]

సరో— [మళ్లీ వచ్చి] ఇవిగో నాన్నా.

లక్ష్మిం— అరే ఉన్నాయా! ఇలా తే, సరే. ఆఁ, ఇవి ఆ డ్రాయరుమీద—వద్దు: ఆ డ్రాయరులోనే వుంచు. ఇవి వాళ్లకోసం తెప్పించామని అనుకోకూడదు. ఎవళ్లహోదా వాళ్లు నిలుపుకోవాలి. ఎంతచెట్టు కంతగాలి! ఏమంటావ్?... ఆఁ—అతనికి ఇరవై రెండేళ్లుంటాయి; కుర్రాడు అందంగానే వుంటాడు; బుద్ధిమంతుడు; ఒయ్; ఏవో నాలుగుముక్కలు చదువుకున్నాడు. మంచి సాంప్రదాయమైన కుటుంబం; ఆ తివాచీ కొంచెం పక్కకి ఈడ్చు తల్లీ. చాలుచాలు: ఆఁ-జాగ్రత్తగా ఆలోచించుకో ముందువెనుకలన్నీ. ఏమంటావ్? (నరసమ్మ వచ్చింది.)

సరో— ఇంకా కొంతకాలం ఆలోచించుకోవాలి నాన్నా.

లక్ష్మిం— ఓయస్. ఇంకా ఓ పావుగంటదాకా ఆలోచించుకోవచ్చు; నా కేమీ అభ్యంతరం లేదు. ఈలోగానే అవో ఇవో తేల్చెయ్యాలి.

నర— దాన్ని ఆలోచించుకోనిస్తారా, మీ చిరాకే నా ?

లక్ష్మిం— ఆలోచించుకోనీ. ఎవరిఖర్మ కెవరు కర్తలు! సుభద్రలా పెళ్లీ పెటాకులూ లేకుండా సన్యాసి పీనుగలా వుండాలని వుందేమో దానికి; సిరివచ్చి పడతానంటే ఇంకా ఆలోచించుకోవాలన్నాట్ట ఓ దౌర్భాగ్యుడు. కలకత్తాలోవున్న సుభద్ర పెత్తల్లి చావాలి; దానికి పెళ్లికావాలి. అందాకా దానిబతుకంతే. ఒకసారి ఇలాగే ఏదోవక సంబంధం వస్తే ఇంకా ఏదో ఆలోచించాలంది. చూస్తున్నావుగా జీవితమంతా ఆలోచించుకొంటోనేవుంది. ఇదంతా నాఖర్మ!

నర— దానిబాధ మనకేముంది లెద్దురూ; దానిబతుకది బతుకుతోంది కదా.

లక్ష్మిం— అది సరేననుకో. ఇంకా నా పీకమీద కూచోలేదంటావా ? ఆఁ, అన్నట్టు... దాని బతుకేదో అదే బతుకుతోంది. ఇలాంటి పిచ్చివాగుడేమీ పెళ్ళివారిదగ్గర రానీయకు సుమా! జాగర్త.

నర— వాళ్లకెలాగా తెలుస్తుంది.

లక్ష్మిం— తెలిస్తే వాళ్లఖర్మ; మననోటిమీంచి రాకూడదంతే...ఆఁ, అన్నట్టు నాపీకమీదింకా కూర్చుంది. నా ప్రాణం తియ్యటానికి అది ఒకత్తేచాలు. ఇంకా సరోజ కూడానా?...అమ్మలూ పెద్ద పెద్ద కట్నాలేమీ ఇయ్యలేం. మన తాహతెంతో నీకు తెలుసుకదా ? కట్నాలివ్వలేనివాళ్లు పెళ్ళివిషయం ఆలోచించకూడదు.

సరో— ఈ రోజుల్లో పెళ్ళిళ్ళంటే భర్తను కొనుక్కోవటమేకదా; అలాంటప్పుడు కాసీలేనివాళ్ళకు మొగుళ్ళే కరువౌతారు.

లక్ష్మిం— పిచ్చిపిల్లా! బొత్తిగా అలా కాదనుకో. కాని డబ్బున్నవాళ్ళకి మంచి సంబంధం దొరుకుతుంది.

సరో.– అందుకని డబ్బులేనివాళ్లు కుళ్లసరుకుతో తృప్తిపడాలా ?

లక్ష్మిం— కావచ్చు. ఆమాటకొస్తే భర్తలుకూడా ఒకవిధంగా అలంకారాలే. ఒక మంచి నగ కొనుక్కోవాలంటే ఎక్కువధర పెట్టాలి.

సరో— డబ్బంటే ఎక్కువ పెడతారుగాని, దగా జరగదనే నమ్మకమేమిటి ?

లక్ష్మిం— నీ కడుపు చల్లగా ఉన్న మాటన్నావ్. నాగేశ్వర్రావు బుద్ధిమంతుడు; అందానికేమీ తీసి కట్టుకాడు. మీరిద్దరూ చిలకాగోరింకల్లా ఉంటారు. ఏమంటావ్ ? ఇంతకంటే ఏదో లక్షాధికారి, నవమన్మథుడూ వస్తాడని కలగంటున్నావా ? అలా అయితే చెప్పు. ఎవడన్నా ఉన్నాడేమో !

సరో— ఛీ, ఏమ్మాటలండీ నాన్నగారూ ?

లక్ష్మిం— [నవ్వి] ఇది నీ కెంతో చక్కని అవకాశం, నా జన్మలో ఇంతకంటే మంచి సమ్మంధాన్ని తేలేను. కుర్రాడు పెద్ద వంశంలో పుట్టినవాడు. ఆస్తేయ పాస్తేయాలకు లోటులేనివాడు. వాళ్ల పెదనాన్నగారు కలెక్టరేట్‌లో హోద్దు గుమస్తా. నా అచ్చాఫీసుకీ కొంత పని కల్పించి నాలుగు రాళ్లు ముట్ట చెప్పించగలడు. ఇతర విషయాలన్నీ అలాఅట్టే పెట్టు. నీకేమైనా ఇబ్బందిగా ఉంటే చెప్పు

నర— అమ్మాయి; నువ్వేమీ చిన్నపిల్లవీ చితక పిల్లవీ కావు; ఇదివరకే పెళ్లయితే, ఈ పాటికి నలుగురు బిడ్డలు పుట్ట వలసిన మాట. ఆలోచించుకో అమ్మా.

లక్ష్మిం— నువ్వు కుర్రాణ్ణి చూసే వుంటావ్.

సరో— నాకతనంటే అంత ఇష్టం లేదండీ నాన్నగారూ.

లక్ష్మిం— అంటే కొంత ఇష్టమే నన్నమాట. అది కూడా లేకుండానే ఎన్నో పెళ్లిళ్లు జరిగి పోయాయి.

నర— నీకతనంటే అసహ్యమా ?

సరో— ఊహుఁ.

లక్ష్మిం— [ఉత్సాహంగా] అయితే ఇంకనేఁ!

సరో— ఆ మాత్రం సరిపోతుందా నాన్నా ?

లక్ష్మిం— కొంచెం సీరియస్‌గా మాట్లాడు కొందాం. నువ్వుచూస్తే ముక్కుపచ్చలారని దానివి. అయినా నీ కేవేవో కలలుంటాయి. పిచ్చి పిచ్చి నవలలు చదివి పాడై పోకుండా నేను గనక నిన్ను కాపాడుకోగలిగాను. మేము

మాత్రం ప్రేమించే పెళ్ళి చేసుకొన్నానంటే వెర్రిపిల్లా ! అయినా మేం ప్రేమగా లేమూ ? ఎందుకొచ్చిందిరా దేముడా అని ఏడుస్తూన్నావున్నామా ? [సరోజ నవ్వుతుంది. సరసమ్మ కూడా] ఎన్నో కుటుంబాల్లో శాంతి లేకుండా పోయిందంటే వాళ్లు ప్రేమించి పెళ్లి చేసుకోవటంవల్లా కాదు. చేసుకోకపోవటంవల్లా కాదు, తెలుసా ?

సరో— [నమ్మకపోయినా నమ్మినట్టు] అది తెలుసునండి నాన్నగారూ; అయినా నన్ను ప్రేమించే వాణ్ణే పెళ్ళాడితే—

లక్ష్మిం— ఇప్పుడు మాత్రం నీకేమి తక్కువయిందంటాను. అతడు ప్రేమించకపోతే ఈ గొడవంతా ఎందుకొస్తుంది ?

సరో— నాభర్త చేతుల్లో ఆట బొమ్మగా ఉండటం నా కిష్టంలేదు.

లక్ష్మిం— ఏమీ భయంలేదు; నీ భర్తని నువ్వే ముక్కు పట్టుకు ఆడిస్తావ్.

సరో— అబ్బ, పోదురూ.

లక్ష్మిం— నాకు తెలుసు గదమ్మా... సరే నీ ఇష్టం వచ్చినట్టు చెయ్యి. ఎన్నో ప్లానులు వేసుకొన్నాను. ఈ అచ్చాఫీసు పని పెరుగుతుందనీ — కనీసం పై సంవత్సరాన్నుంచైనా కడుపులో చల్ల కదలకుండా విశ్రాంతి తీసుకోవచ్చుననీ అనుకున్నాను. నేనిప్పటికే ముసలి వాణ్ణయి పోయ్యాను. ఇంక బతికినంత కాలం బతకను గదా. కాస్త విశ్రాంతి తీసుకొనే యోగం లేదు కాబోలు ఈ బతుక్కి. నువ్వూ బుద్ధిమంతురాలివి. నీకూ జ్ఞానంవచ్చింది. ఈ ముసలాడు కాస్త తెరిపినపడటం నీ కిష్టంలేదా చెప్పు?

సరో— నా కిష్టమే నాన్నగారూ. [కన్నీళ్లు పెట్టుకొంటుంది.]

లక్ష్మిం— [శాంతిస్తూ] సరే అయితే. అయినా నిన్ను బాధపెట్టి నేను సాధించేది కూడా ఏమీలేదు. నీ ఇష్టం. నువ్వే ఆలోచించుకో, నాకు జవాబు వెంటనే చెప్పక్ఖర్లేదు. నేను నిన్ను కోరేదేమిటంటే; ఒకవేళ వాళ్ళకీ మనకూ అన్నీ నచ్చి సరేఅంటే సరేఅనుకుంటే నువ్వుమాత్రం పెంకితనం చెయ్యకూడదు. కావలిస్తే మీ అమ్మ అతన్ని లోపలికిపిలుస్తుంది. అడగవలసిందేమున్నా ఉంటే నువ్వే అడుగు. నువ్వూ జ్ఞానంవచ్చినదానివి.

నర— జాగ్రత్తగా ఆలోచించుకో తల్లీ.

లక్ష్మిం— ఆ సుభద్రచూడు; నా మెడకి గుదిబండలా ఉంది.

నర— మమ్మల్ని నలుగురిలోనూ అల్లరిపెట్టకు తల్లీ.

లక్ష్మిం—నీకు పెళ్లివయస్సు రాలేదంటావా ?

నర— బాగానే ఉంది మీ మాట.

లక్ష్మిం— పోనీ ఇంకెవరినన్నా చేసుకోవాలనుకుంటున్నావా ?

సరో— ఛా.

నర— అదేమిటండీ! ముక్కూ మొహం తెలియనిదాన్ని పట్టుకొని అలా పీకుతారు. మీరుచెపితే కాదంటుందా ఏమిటి?

లక్ష్మిం— అదికాదే. దాని అభిప్రాయం ఏమిటో తెలుసుకుందామని ... సరే, తేలిపోయిందా? ఇహ ఈ సమ్మంధం తప్పనట్టే. [గడియారంచూసి] ఇదిగో, ఇంకొక్క ఐదునిమిషాల్లో వస్తారువాళ్లు. ఈపాటికి వస్తుండాలి. [సరోజ నిశ్చేష్టురాలై కిటికీలోంచి బైటకిచూస్తోంది. అదిచూసి లక్ష్మింపతికి కోపం వచ్చింది. భార్యతో] ఎందుకలా చూస్తుంది?

నర— సుందరమ్మగారు పిల్లల్ని వెంట బెట్టుకొని వెడుతోంది. అందుకని.

సరో— [తియ్యని కలలనుంచి తేరుకోకుండానే, ఏదో పలవరిస్తున్నట్టు] సరే.

లక్ష్మిం— ఏమిటి సరే?

సరో— మీ ఇష్ట ప్రకారమే చెయ్యండి నాన్నగారూ.

లక్ష్మిం— అహాఁ హాఁ! అవసరాలవారింటికెళ్లి జార్జెట్ చీర తెచ్చుకోతల్లీ.

సరో— బట్టలు ఎరువుతెచ్చుకోవాలా నాన్నా?

లక్ష్మిం— ఆమాత్రం తెలియకపోతే ఎలాగమ్మా?

సరో— ఏమికట్టుకోను?

నర— [కొంచెం ఆలోచించి] నేను చెప్తానుండు. [అకస్మాత్తుగా ఏదో మెరుపు మెరిసినట్టు] నా పట్టుచీర పెట్లోంచి తీసికట్టుకో.

సరో— మనం ఎవరింటికీ భోజనాలకెళ్లటం లేదుకదమ్మా?

నర— అయినా ఫరవాలేదు; కట్టుకో.

సరో— కొంపతీసి అతను నా బట్టల్ని వరించడు కదా!

నర— ఎడ్డెమంటే తెడ్డెమనకు. నా మాటవిని ముందు పట్టుచీరకట్టుకో. ఊఁ. వెళ్లు ముందు.

సరో— అలాగే. [వెళ్లింది]

లక్ష్మిం— [ఉలిక్కిపడి] కొంపతీసి ఎవరింటికన్నా భోజనానికి వెడుతున్నారేమిటే?

నర— అబ్బే, లేదండీ.

లక్ష్మిం— అయితే?

నర— అమ్మాయికి పెళ్ళివారు వస్తున్నారుకదండీ.

లక్ష్మిం— [అర్థంచేసుకొని] అవునవును. పట్టుచీర కట్టుకుంటే సరోజ చాలా అందంగా ఉంటుంది.

పస్త్రరా— అయ్యగారూ, మీకోసాని కెవరో వచ్చారండి.

లక్ష్మిం— వచ్చారూ? వస్తారను కుంటూనే ఉన్నాను. కాస్సేపు వాళ్లని కూర్చోమనాలి. వాళ్లురాగానే ఎదురు సన్నాహం వెడితేవాళ్ళ దృష్టిలో మనం చవకయి పోతాం. ఒక నిముషంలో వస్తున్నామని చెప్పికూర్చోబెట్టు.

కుర్రా— అయ్యో!

[లక్ష్మింపతి, నరసమ్మ పక్కగదిలోకి వెళ్ళిపోయారు. కొంతసేపటికి సీతారామయ్యగారు, బాపనమ్మగారూ వచ్చారు. నవ్వుతూ వచ్చిన వారల్లా ఆగది చూసి, ఖాళీగా ఉన్నందుకు తెల్లబోయారు.]

సీతా— వారింట్లో లేరూ?

కుర్రా— ఉన్నారండి. అమ్మగారితో చెప్పివస్తానండి. [వెళ్ళిపోతాడు.]

బాప— [నవ్వి] అమ్మగారితో చెప్తాడట! ఏదో గొప్ప వాళ్ళ మనుకుంటున్నట్టున్నారు. మనం వస్తామని వాళ్ళకి తెలీదూ?

సీతా— నీకూ అదే ఆలోచన కలిగిందీ?

బాప— వీళ్ళ వరస చూస్తే కొంచెం టోకరా వేసేటట్టున్నారు. ఏమంత ఉన్నవాళ్ళల్లా లేరు వీళ్ళు; ఏమైనా, ఎందుకైనా మంచిది, ఈ సంబంధం మీద మనకెంతో మోజుగా ఉన్నట్టు నటించకండి.

సీతా— అలాగేలే.

బాప— ఆస్తిహక్కులిద్దరికీ సమానంగా ఉండాలని వాళ్ళెంత వాళ్ళే కోరేలా చూడండి.

సీతా— అలాగేలే.

బాప— అందుకని రాతకోతలన్నీ జరిగితీరాలని చెప్పండి.

సీతా— అలాగేలే.

బాప— తతిమ్మా విషయాలన్నీ మీకెలా మంచిదని తోస్తే అలాచేయండి. ముక్తసరిగా మాత్రం మాట్లాడండి.

సీతా— కాని—

బాప— అలావుంటేనే ఏవ్యవహారమన్నా జాగ్రత్తగా నిర్వహించగలరు మీరు.

సీతా— నీతో ఒక విషయం చెప్పాలనుకుంటున్నాను.

బాప— ఏదో పిచ్చివాగుడు వాగుతారని నాకు తెలుసు. అయినా అదేమిటో చెప్పండి.

సీతా— ఇందాకా నీతో అన్నాను కదులే; ఆ విషయమే. అదే నన్ను చాలా బాధపెడుతోంది. లక్ష్మింపతిగారు వాళ్ల పిల్ల పెళ్ళికని రెండు మూడు వేల రూపాయలదాకా ముట్టచెప్తాడుకదా?

బాప— మూడువేలకు తగ్గకూడదు ... మీరు మన కుర్రాడికి కట్నం అనకండి, వాడు 'ససేమిరా, నాకుకట్నం వద్దం'టున్నాడు. వాళ్ళ పిల్లకే పెట్టుకోమందాం.

సీతా— సరేననుకో: మనదగ్గర చూస్తే చిల్లిగవ్వ లేదు. పోనీ మా అన్న దగ్గిర పుచ్చుకుందామనుకున్నా — అతను పుట్టెడు అప్పుల్లో, మనమలాగే, మునిగిపోయి ఉన్నాడు. ఆసంగతి వీళ్ళకీ తెలియదనుకుంటాను.

బాప— అది వీళ్ళకే కాదు; బ్రహ్మకికూడా తెలియదు.

సీతా— మరి ఆసంగతి వాళ్ళకి చెప్పకపోవటం వాళ్ళని మోసంచేసినట్టు కాదూ?

బాప— అదేంమాటలండీ; మీది బొత్తిగావిడ్డూరం.

సీతా— నీకు తెలియదయ్యా.

బాప— ఆ సంగతి మీరుచెప్పేకంటే ఇప్పుడే మనం వెళ్ళిపోవటం నయం.

సీతా— చూశావూ?—

బాప— ఆ చూస్తున్నాను; మనం నోరునొక్కుకొని కూర్చోవటమే మంచిదని చూస్తున్నాను. మీకు లక్ష్మింపతిగార్ని దగాచెయ్యటమే బాధగాతోస్తే, నాకు మా బావగార్ని మోసంచేయటం బాధగావుంది.

సీతా— అదేంమాట? ఆయన్ని నేనేం దగాచేశాను?

బాప— ఆయనగుట్టు వెల్లడిచెయ్యటంచాలమా? ఇంకా వేరే దగాచెయ్యాలా? మీపాటి ధర్మచింత నాకూవుంది; నా ప్రారబ్ధంకొద్దీ మీరాసంగతి కనిపెట్టలేకపొయ్యారు. కడుపుచించుకుంటే కాళ్ళమీదపడుతుందనే దూరదృష్టితో ఇంట్లోవాళ్ళ గొంతుకొయ్యటంకంటే పరాయివాళ్ళ పీక కత్తిరించటం మంచిదని ఊరుకున్నాను. వంద అబద్ధాలాడన్నా ఒకఇల్లు నిలబెట్టాలన్నారు.

సీతా— అదికాదే, వాళ్ళు నిలదీసి అడిగితే ఏమి చెప్పనా అని?

బాప— అయితే ఆ సంగతి బావగార్నే అడగాలి. ఎంతచెడ్డా ఆయన కుటుంబ పెద్ద కదా మరి!

సీతా— నువ్వు ఎంత చెప్పినాకూడా నాకు నిజం— [అనుమానిస్తాడు. క్షణం ఆగుతాడు.]

బాప— ఎందుకిలా నానుస్తారు? అదేమిటో కుండ బద్దలు కొట్టినట్టు చెప్పేయండి. మీకు వెళ్ళిపోదామని వుంటే పదండి. మీరే ఈ యింటికి పెద్దలు. మీరు ఎలాచెప్తే అలా నడుచుకోవలసిన దాన్ని. కానీయండి. పోదామా?

సీతా— [ఒక్కక్షణం బాధగా ఆలోచించి, ఏ నిర్ణయానికీ రాలేక] తీరా వచ్చాక వెళ్ళిపోతే వాళ్ళేమనుకుంటారు?

బాప— ఇంకో విషయంకూడా జ్ఞాపకం వుంచుకోండి; ఎందుకేనా మంచిది. లక్ష్మింపతిగారి పెద్దమ్మాయి ఎవరితోనో లేచిపోయి ఇప్పుడు కాకినాడలో వుంటోందట! అలాంటివాళ్ళ పిల్లని చేసుకుంటామనటమే వాళ్ళకి పదివే[illegible].

సీతా— ఉష్!

[లక్ష్మింపతి, నరసమ్మ వచ్చారు. 'నమస్కారం', 'నమస్కారం', 'ఆలస్యమైంది క్షమించండి' 'అహా, ఎంతమాట' మొదలైన [illegible] జరుగుతుంది.]

బాప— నరసమ్మగారూ, చల్లకొచ్చి ముంత దాచటమెందుకు? అసలు కథలోకే సూటీగా వస్తాను. మావారూ నేనూ! మీ అమ్మాయి మావాడిలో—ఏమని చెప్ప[illegible]

[illegible]

మంటారు — ఒకసదభిప్రాయం అంటేనో ?— ఒకసదభిప్రాయం కలిగించిందని గ్రహించాం.

సీతా— అవును అంతే.

బాప— మా నాగేంద్రం కూడా ఇక్కడికి త్వరలోనే వస్తాడు. అయినా అతగాడికేమీ ఈసంగతి తెలియదనుకోండి.

లక్ష్మిం— మా అమ్మాయికి కూడా ఇంతవరకూ ఏమీ తెలియదండి.

న— లోపల బట్టకట్టుకొంటోంది. గరిమెళ్ళ వారింట్లో పెళ్ళికని; భోజనానికెడుతోంది. అందుకని పట్టుచీర కట్టుకొంటోంది.

లక్ష్మిం— మామూలు బట్టల్తో వెళ్ళటం సిగ్గనికాదు.

నర— రామరామ. అలాంటిపిచ్చి వేషాలేమీలేవు మాచంటి దానికి

లక్ష్మిం— తన జాకెట్లు దగ్గర్నుంచి అన్నీ స్వయంగానే కుట్టుకుంటుంది కదే ?

నర— ఔనౌను. మాఇంట్లో మిషనువాడి బిల్లంటూ ఏమీ ఎరగం.

లక్ష్మిం— ఇన్ని పనులున్నా సంగీతం అద్భుతంగా పాడుతుంది ; మా అమ్మాయనికాదు. కిన్నెర కంఠం కదండీ,

నర— అద్భుతంగా పాడుతుంది, త్యాగరాజు కృతులన్నీ వచ్చు. హంసధ్వని రాగం ఆవిడకెంతో ఇష్టం.

బాప— త్యాగరాజు కృతులా ? మంచిదే !

నర— నేనూ అలాగే విన్నాను.

బాప— మీ అమ్మాయి చాలా అందమైనదే.

నర— చాలా మంచిదికూడా. కాస్త అభిమానం చూపిస్తే చాలు కొండెక్కి పోతుంది వెర్రిపిల్ల !

లక్ష్మిం— [సీతారామయ్యకి ఆఫర్ చేస్తూ] ఒకటి తీసుకోండి.

సీతా— వద్దండీ; భోజనాలకి ముందు చుట్టకాల్చే అలవాటు లేదు నాకు.

లక్ష్మిం— అయినా ఫరవాలేదు ! ఒకటి తీసుకోండి. పోనీ తర్వాత కాల్చుకొందురుగాని. నేను సాధారణంగా ఇవే కాలుస్తాను. చాలా బాగుంటాయండీ.

సీతా— [ఒకటి తీసుకొని] థాంక్స్.

బాప— మావాడికి ఎన్నో సంబంధాలొస్తున్నాయి. అయినా తగిన అన్నంలోకి తగిన కూర దొరకాలని ఇంతవరకూ ఊరుకున్నాం. మాకు కట్నాలూ కానుకలూ అంటే అంత పట్టింపు లేదనుకోండి... అయినా ఈరోజుల్లో కుర్రాళ్ళు—వాళ్లకెన్నని నచ్చాలి? మా కెవళ్ళకీ కట్నమంటే ఇష్టంలేదు, వాడికి మీ దయవల్ల ఏమీ లోపంలేదు. ఇక ముద్దు ముచ్చటలకని ఏమి పెట్టుకొన్నా మీ అమ్మాయికే.

నర— ఒక నాలుగిటో ఆటో మాకూ ఏమంత బాధలేదు. డబ్బు విషయాల్లో మనకంత పట్టింపుల్లేకపోవడం నాకుచాలా సంతోషంగా ఉందండి.

బాప— మా వాడికి సుమారు నూరు సంబంధాలు వొచ్చాయి. అరికాళ్ళకింద మంటలు పెట్టేసే వాళ్లు నిత్యం.

లక్ష్మీం— మా అమ్మాయికీ ఎన్నో సంబంధాలు వచ్చాయండీ. మా ఇంట్లో అలాంటి దుర్ఘన జరగ బట్టిగాని, లేతపోతేనా ?

సీతా— అవును విన్నాను.

బాప— దుర్ఘటనా? అదేమి దుర్ఘటనో మాకు తెలియదు సుమండీ. ఏమిటండీమీరంటు న్నారు ? మిమ్మల్నే !

సీతా— [తడబడుతూ] నేనంటున్నా నా ?—ఏమిలేదు—నేనేమీ అనలేదే.

బాప— [నరసమ్మతో] అయితే ఏదో దుర్ఘటన మీఇంట్లో జరిగిందన్నమాట ?

లక్ష్మీం— అవును. నాతొలి భార్యకి ఇద్దరాడపిల్లలు. అందులో ఆ తెలివితక్కువ సుభద్రని మీరెరుగుదురను కుంటాను.

బాప— అవును, ఆమెకింకా పెళ్ళికాలేదు కదండి ?

లక్ష్మీం— పెళ్ళిచేసుకోను మొర్రో అంటుంది. అదీ కారణం. దీనికంటే పెద్దది సత్యవతి. పదిహేనో ఏటే కాలంజారి నానా అపఖ్యాతీ తెచ్చింది. ఏం చెయ్యను చెప్పండి? అవతలికి తరిమేశాను. ఎంత బాధపడ్డానో అలాచేయుటానికి.

నర— ఆ తరువాత మూడురోజులపాటు ఆయనకు నిద్రాహారాలు లేవు.

లక్ష్మీం— నమ్మండి నామాట, ఎంత కుమిలి పొయ్యానో చెప్పలేను. ఏంచెయ్యను చెప్పండి కుటుంబగౌరవం నిలుపు కోవాలంటే అలాప్రవర్తించక తప్పదు.

బాప— అవునమ్మా, అయితాగున్నై పుట్టిం తర్వాత తప్పుతుందా చెప్పండి !

సీతా— ఆపిల్లమీద మీకంత మమకారం ఉన్నప్పుడు ఇంట్లోనే అట్టేపెట్టుకో వల సింది. చెట్టుకాయ చెట్టుకు బరువౌతుందా ?

బాప— ఊరుకోండి. ఎవరన్నా వింటే నవ్విపోతారు, ఏమీఆలోచించకుండా మాట్లాడే స్తారు. [లక్ష్మీంపతిగారితో] పాపం, ఆ పిల్ల ఏమయినట్టు ?

లక్ష్మీం— [నిర్మొహమాటంగా అబద్ధమాడేస్తూ] ప్రస్తుతం వాళ్లపెత్తల్లి దగ్గర కలకత్తాలోఉంది.

బాప— కలకత్తాలోనా ? ...ఏమైనా, మీరలాప్రవర్తించడం కొంతనయం [ఆలోచించి] అయినా కొంతమంది అపోహపడతారు చూడండి ; లోకులు కాకుల్లాంటి వాళ్లు. వాళ్ళనోరు కట్టేస్తానాలా కష్టం—ఘరవాలేదు; ఇంతలోకే మా మనస్సు మళ్ళిపోతుందను కోకండి. అప్పుడే విరిగిపోదు. [భర్తతో] ఏమంటారండీ ?

సీతా— నేనా !

బాప— ఆఁ, మీరే. అవునులెండి, మీరుమాత్రం ఏమంటారు? సరిగ్గా నాఉద్దేశమేమీది కూడా అనుకుంటాను. అన్నీకలిసొచ్చి—దైవబలంకూడా ఉంటేమాట; అయినా

ఒక సందేహం అడుగుతాను, ఏమీ అనుకోకండేం?—నాకు ఈడబ్బుగొడవంటే మహాతలనొప్పి. అందుకని ఆ గొడవలన్నీ ఒక సారితెంపేసుకొంటే.
లక్ష్మిం— ఫరవాలేదు అడగండి.
బాప— మీ అమ్మాయికి- మరోలా అనుకోకండేం ! —ఏమాత్రం లాంఛనాల క్రింద ఇద్దామను కుంటున్నారో—[సందేహిస్తుంది.]
లక్ష్మిం— అవునవును. ఏదోసుమారుగా ఇంతని—
సీతా— అంతే అంతే.
బాప— అదేనో వింటామని—
లక్ష్మిం— ఐదువేలదాకా ఇద్దామను కుంటున్నాను.
బాప—ఐదు వేలా? [భర్తతో] విన్నారా? ఐదు వేలే ఇద్దామను కుంటున్నారట.
సీతా— ఓహో, అలానా ? [క్షణంనిశ్శబ్దం]
లక్ష్మిం— పెళ్ళి సమయంలో రెండు వేల ఐదొందలు ఇస్తాను. తరువాత ఐదారు నెలల్లో మిగతా రెండువేల ఐదొందలూ ఇచ్చుకుంటాను.
బాప— [భర్తతో] విన్నారూ ?
సీతా— ఆ.
బాప— అంటే ప్రస్తుతం రెండువేల ఐదొందలూ, ఒక హామీని.
లక్ష్మిం— రెండు వేల ఐదొందలు రొఖమూ, మాటహామీ మాత్రమేనండోయ్.
బాప—సీతాహో ! అవునవును అదే నేనంటున్నదిన్నీ [భర్తతో] ఈ పరిస్థితుల్లో ఏమిచెప్పటానికీ నోరు రావటంలేదు. [లక్ష్మింపతితో] మాకు నలుగురులోనూ చిన్నతనంగా ఉంటుందని మా ఆయన ఒప్పుకోలేదు. బొత్తిగా చాలా తక్కువే అనుకోండి.
లక్ష్మిం— మీ అబ్బాయి వాటాకి ఏమాత్రం వస్తుంది ?
బాప— ఒక్కగింజకూడా రాదు. ఏమున్నా అంతా మా ఆయన నిర్వాకమే. ఉన్న మాట మొహంమీద చెప్పొద్దూ. మావాడి భార్యసొమ్మును పెట్టుబడిగా తీసుకొని ఆయన వ్యాపారంలో వాడికికూడా వాటాయిస్తారు.
సీతా— అంతేఅంతే.
బాప— మా అనంతరం మాదంతా వాడికి కాకపోతే ఎవరికండి ?
లక్ష్మిం— మీరుకూడా ఆరోగ్యంగానే ఉన్నారు.
బాప— ఏదో మీ దయవల్ల.
నర— మీ అబ్బాయికి పెత్తండ్రిగారు ఎవరో—?
బాప— అవునండి.
లక్ష్మిం— ఆయనకు మీవాడంటే ఎంతో ప్రేమని అందరూ చెప్పుకొంటూంటారు.
బాప— ఔనౌను. చాలాప్రేమ.
సీతా— అంతే అంతే.

లక్ష్మిం— బాగా స్థితి పరుడనికూడా చెప్పుకొంటారు.

బాప— అవును, మేము లెక్క పెట్టుకోలేదులెండి.

నర— అయినా అతని పెత్తండ్రిగారి ఆస్తికూడా అతనికే వస్తుందనుకుంటాను.

బాప— ఏమీ సందేహంలేదు. ఆయనకున్నదంతా అతనికే వస్తుంది.

సీతా— అంతే అంతే.

నర— అయనంటే కలక్టరుకూడా గడగడలాడుతాడటగా ?

బాప— అవునట. దానికేంగాని, బొత్తిగా పాతికవందలంటే—

లక్ష్మిం— నా శక్తికి మించి నేను చెప్పాను.

బాప— దేనికన్నా ఘటనకూడా ఉండాలి. [లేచినిలబడి భర్తతో] లేవండి ఉంటాగామండీ.

లక్ష్మిం— నేను మూడువేలదాకా నిలబడతాను.

బాప— ఇంకో రెండు వేలు అరువు పెడుతున్నారంటే పొరుగమ్మలు బుగ్గలు నొక్కుకుంటారని గాని

లక్ష్మిం— ఏదన్నా ఒక వ్యవహారం తల పెట్టాక నాలుగు రూపాయలు ఇటో అటో తుంచెయ్యక తప్పదు. మధ్యవర్తుని తగువు చెప్పావినండి. ప్రస్తుతం మూడు వేలూ, మాకు తణుకులో ఉన్న ఇల్లూ ఇచ్చుకుంటాను.

బాప— అద్దెలు అంతబాగా ఎక్కువనుకుంటాను.

లక్ష్మిం— ఎంతమాటన్నారు ? ఇప్పుడు అద్దెలు బాగానే వస్తున్నాయండీ.

బాప— ఏమండీ, ఏమిటాలోచించారు ?

సీతా— అబ్బాయి గోలచేస్తున్నాడని ఆలోచిస్తున్నాను.

బాప— అవును. కాకపోతే మనకీ ఖర్మమేమిటి? [కూర్చొని] ఓయి వెర్రినాయనా ! [ఏడుస్తుంది.]

సీతా— [లక్ష్మింపతితో] ఏమైనా కన్నకడుపు కదండీ ! మరోలా అనుకోకండి.

లక్ష్మిం— చిత్తం నాకు తెలుసులెండి.

బాప— [కొంగుతో కళ్ళు తుడుచుకొంటూ] ఇంకో ఆరునెలల్లో అతిమ్మా రెండువేల ఐదొందలూ.

నర— తప్పకుండా ఇస్తాం. [వెళ్ళింది.]

బాప— రాత్రకోత లేకున్నా జరగాలంటూరా ?

లక్ష్మిం— ఆ విషయంలో ఇదివరకే నేనొక నిర్ణయాని కొచ్చేశాను.

సీతా— మేముకూడా ఒక అభిప్రాయానికి కొచ్చాం.

లక్ష్మిం— ఎవరి అస్థులు వారికి కేటాయింపుగా ఉండాలి...మీ కిష్టమేనా ?

సీతా— మాకిష్టమే కాని ఇంకోలాచేస్తే—

లక్ష్మిం— అస్థులెవ్వరికీ ఉమ్మడి హక్కుండాలనా ?

సీతా— అదే బావుంటుందనుకుంటున్నాను.

లక్ష్మిం— అవునులెండి; అదే బావుంటుంది. అమ్మాయి సొమ్ము అబ్బాయికీ అబ్బాయి సొమ్ము అమ్మాయికీ కాకపోతే వాళ్ళ అన్యోన్యం చెడచ్చును.

సీతా— నిజం చెప్పారు. బాగుంది సుమండీ.

లక్ష్మిం— పోనీ ఒకలా చేద్దాం. పెళ్ళికాలమందు నే నిచ్చేదంతా అమ్మాయిదే. ఆతరవాత నేనిచ్చేదీ, భవిష్యత్తులో అతని కొచ్చేదీ, అంతా ఉమ్మడిగా ఉంటుంది.

సీతా— పోనీ అలాగే చేద్దాం.

లక్ష్మిం— ఖాయమేకదూ ?

సీతా— ఖాయం.

[ఇంతలో నాగేశ్వరావు వచ్చాడు; సుమారు ఇరవైరెండేళ్ళుంటాయి. బుద్ధిమంతుడే. వస్తూనే అందరికీ నమస్కరిస్తాడు.]

బాప— నాగయ్యా ! [నాగేశ్వరావును పక్కగదిలోకి పిలిచి, మెల్లగా] స్థిరపడి పోయిందిరా.

నాగే— [కంఠం] ఎంతకే.

బాప— [కంఠం] కట్నమేమీ కాదులే. వాళ్ల అమ్మాయికి లాంఛనం క్రింద ప్రస్తుతం ముప్పైవందలు, తెణుకులో ఇల్లు, ఇంకో ఆరునెలల్లో మరో ఇరవైఐదువందలూ.

నాగే— [కంఠం] బాగుందమ్మా.

బాప— [కంఠం] ఇంక అమ్మాయి సంగతి నువ్వే చూసుకోవాలి.

నాగే— [కంఠం] కొంచెం జల్సాగా ఉంటుందా లేక ఖరోడాలా ఉంటుందే అమ్మా,

బాప— [కంఠం] తినబోతూ రుచి ఎందుకు నాయనా; జల్సాగానే ఉంటుంది. త్యాగరాజు కృతులన్నీ వాయిస్తుందట.

నాగే— [కంఠం] చచ్చా! నా నాయనో !

బాప— [కంఠం] నాకూ అలాగే అనిపించింది. పెళ్ళయి, నలుగురు పిల్లలు పుట్టిం తరువాత—

నాగే— [కంఠం] పిల్లలా? అంతతొందర పడకే అమ్మా. పిల్లలంటే ఈ రోజుల్లో ఎంత ఖర్చో తెలుసా ? పైగా లాల్చీమీద ఉచ్చపోస్తారు; ఛీ.

బాప— [కంఠం] పోనీలే. ముందు మాత్రం ఆవిడ ఇష్టం వచ్చినట్టు 'ఊఁ' అను. తరువాత నీకేమిటోయ్ రాజువి.

నాగే— [కంఠం] అవునులే.

బాప— [తిరిగివచ్చి] నరసమ్మగారూ, పెళ్ళి కూతురుకు నచ్చుతానోలేదో అని అనుమానిస్తున్నాడు మా నాగేంద్రం.

లక్ష్మిం— అదేం మాటలెస్తురూ !

బాప— లాంఛనాల విషయం కూడా___

లక్ష్మిం— ఇంక అదే నా ఆఖరిమాట [భార్యతో] ఏమే సరోజ ఎక్కడుంది ?
నర— వెళ్ళి తీసుకొస్తాను.
నాగే— ముందు ఈ చిన్న చిన్న విషయాలన్నీ తేలిపోవటం నాకుచాలా సంతోషంగా వుందండీ.
లక్ష్మిం— సంతోషం కాదా నాయనా.

[పక్క గదిలో]

నర— [కంఠం] ఇంక అంతా నీ చేతుల్లోవుంది సరోజా. మిమ్మల్నిద్దర్నీ మాట్లాడుకొనేట్టు చేస్తాం. సరూ, జాగ్రత్తసుమా; ఇదే నీకు ఆఖరి అవకాశం. దాన్ని చెందనాడుకోకు.
సరో— [కంఠం] నేనూ ఆలోచించుకున్నానమ్మా. నాకు సుభద్రలా ఉండాలనిలేదు. కనుక___
నర— [కంఠం] నువ్వెలాగో లొంగదీసుకోవాలి అతగాణ్ణి. వ్యాపారమంటే చెవికోసుకుంటా డతను. నువ్వుకూడా అతనికి అందులో సహాయం చేయగలవని అతను గ్రహించి నట్టయితే—
సరో— [కంఠం] అంకెలంటే నాకు బలే తలనొప్పమ్మా.
నర— [కంఠం] అమ్మలూ, పెళ్ళయ్యాక నీ ఇష్టంవచ్చినట్టుండచ్చు. చూడు ఆ పమిట కొంచెం పక్కకి సర్దుకో. అతనొక్కడూ అయితే ఎలావున్నా ఫర్వాలేదు. ప్రేమికులమధ్య అలాంటి ఇబ్బందులేమీ ఉండవు.
సరో— [కంఠం] అమ్మా, బాగుండదే వెడదాంపద.

[నరసమ్మా, సరోజ వచ్చారు]

బాప— అమ్మాయికేం, చిలకలా ఉంటుంది అలాకూర్చో తల్లీ ... [లక్ష్మింపతితో] అన్నగారూ, నే నెప్పుడూ అచ్చాఫీసు చూడలేదు. నాకు చూడాలనివుంది వెడదామా?
లక్ష్మిం— [సంతోషంతో] రండి, దయచేయండి.
బాప— తంబాలా ఇంతమంది ఎందుకు? కుర్రాళ్ళని ఇక్కడే వదిలేద్దాం; ఏమంటారు వదినా ?
నర— అలాగేనమ్మా.

[వెళ్ళిపోతారు]

నాగేం— [హార్మనీ చూస్తూ] నీకు త్యాగరాజ కృతులు యిష్టమా?
సరో— ఊఁ.
నాగేం— నాకు బలే ఇష్టం. అవి అంటేచాలు చెవికోసుకొంటాను.
సరో— ఆయన చాలా గొప్పవాడు
నాగేం— కాదుమరీ, చాలా గొప్పవాడు.

సరో— అతని కొక్కడికే సంగీతం తెలుసు.
నాగేం— చిన్నయసూరికి వ్యాకరణం లాగ.
సరో— తాళ్ళపాక అనంతామాత్యుడుకూడా ఈయన కందడు.
నాగేం— తాళ్ళపాక, త్యాగరాజుకెప్పడూ తీసికట్టే—మనిద్దరికీ కళమీద అచ్చుపోకే అభిప్రాయం ఉండటం ఏమి అదృష్టం! [ఆగి] ఆc— మీవాళ్ళేమన్నా చెప్పారా?
సరో— దేన్ని గురించి?
నాగేం— మీవాళ్ళమాటే. మావాళ్ళేమీ నాకు చెప్పలేదు.
సరో— నాకేమీ చెప్పలేదుకాని, నేనే గ్రహించాను.
నాగేం— నేనూ అంతే. ఇంక మనిద్దరమూ మొగుడూ పెళ్ళాల మౌతామన్నట్టే.
సరో— ఏదో కొన్ని — కొన్ని సందేహా లడగాలనుకుంటున్నాను.
నాగేం— వోల్ రహిట్! అడగవచ్చును.
సరో— మీకు పిల్లలంటే ఇష్టమా?
నాగేం— అబ్బ. మహాచెడ్డ ఇష్టం.
సరో— నిజంగా?
నాగేం— నూటికి తొంభై తొమ్మిగి వంతులూ.
సరో— నేను పిల్లలంటే పడి చచ్చిపోతాను. నాదృష్టిలో పిల్లలే ఏ సౌఖ్యమన్నా. వాళ్ళకోసమే ఎవరైనా ఎందుకైనా జీవించాలంటే, [నిట్టూర్చి] నాకు వివాహంమీద అందరికంటేకూడా కొన్ని విపరీత అభిప్రాయాలున్నాయి. నా హృదయమూ, నా మనస్సుకూడా తృప్తిపడాలి.
నాగేం— సబుపే మరి.
సరో— ఒక వ్యాపారంలో భాగస్వాముల్లా వర్తించే వైవాహిక జీవితమంటే నా కెంతో అసహ్యం
నాగేం— అసహ్యం! బలేమాట వాడారు.
సరో— మీకు పెళ్ళిళ్ళకీ పేరంటాలకీ వెళ్ళటమంటే ఇష్టమా?
నాగేం— ఛీ ఛీ, నాకిష్టముండదు.
సరో— నాకూ అంతే.
నాగేం— ఎప్పుడైనా దానివల్ల వ్యాపారం లాభిస్తుందని తోస్తే, పిలుపులకు వెడతాను. అది నీకు అభ్యంతరం కాదుకదూ?
సరో— ఒతేలామూ.
నాగేం— నీకు వ్యాపారమంటే సరదాయేనా?
సరో— నా చిన్నతనంలో మానాన్నగారికి ఎకౌంట్లలో సాయం చేసేదాన్ని.
నాగేం— ఇప్పుడో?
సరో— నా దురదృష్టంకొద్దీ మా నాన్నగారు గుమాస్తాను పెట్టుకొన్నారు.

నాగేం— నువ్వు ఎంత అందంగా ఉంటావో నీకు తెలుసా?

సరో— ఎప్పుడో మీరే అన్నారు.

నాగేం— వర్ధీవారింట్లో పెళ్ళికనుకుంటాను. ఆవేళ భోజనానికొచ్చినప్పుడు సరిగ్గా ఇదే చీరతో ఉన్నావ్. నువ్వెంతో అందంగా ఉంటావ్; అబ్బ! [ఆమె చెయ్యి పట్టుకుంటాడు.]

సరో— (ఇబ్బందిగా) ఊహుఁ.

నాగేం— ఫరవాలేదు. మనకింక పెళ్ళయిపోయినట్టే ఒక్క ముద్దియ్యి. ఊఁ.

సరో— ఛీ.

నాగేం— ఇవ్వవ్?

సరో— ఊహుఁ.

నాగేం— నీచేతులెంత బాగున్నాయో! [కొంచెం దగ్గిరికిగా లాక్కుంటాడు.]

సరో— నేను పోతాను.

నాగేం— [ఉద్రేకం ఎక్కువయి, మెల్లగా] కదలద్దు; అబ్బ; నన్ను చంపేస్తున్నావ్ [వేళ్ళమీద ముద్దు పెట్టుకుంటాడు.]

సరో— [చెయ్యి లాక్కొని] ఇదేంపని? బాగుంది!

నాగేం— పోనీలే, నీకిష్టంలేకపోతే [సరోజ కొంత లోపల వితర్కించుకొని ప్రసన్నంగా నాగేంద్రం దగ్గర కెడుతుంది. నాగేంద్రం ఆమె చుబుకాన్ని పట్టుకొని ముద్దు పెట్టుకోబోతూంటే, సరోజ తటుక్కున వెనక్కి తగ్గి.]

సరో— ఉష్! వాళ్ళొచ్చేశారు.

[వాళ్లువచ్చారు.]

లక్ష్మిం— మనకు గవర్నమెంటు కాంట్రాక్టులు తగిలాయంటే నావ్యాపారం రెట్టింపవుతుందికదా!

సీతా— అద్భుతం, అద్భుతం.

బాప— ఇప్పటికే పొద్దుపోయింది. వేరేతాంబూలాలక్ఖర్లేదులెండి. మాట ఒకటీ చేత ఒకటీనా? త్వరలో ముహూర్తం ఏర్పాటు చేయించండి.

సీతా— సర్వమంగళాని భవంతి.

బాప— రా[illegible]యనా. నాగేంద్రం? ఉంటావేపిల్లా. ఉంటామండి అన్నగారూ; వొ[illegible].

లక్ష్మిం— పెద్దబావగార్ని అడిగానని చెప్పండి.

బాప— అయ్యో ఎంతమాట!

[వెళ్తారు.]

నాగేం— [కంఠం] అమ్మా అ దంతో అందంగాఉందే. అమ్మా నేనుకూడా అందంగానే ఉన్నానే. త్యాగరాజు, పిల్లలు,—ఇలాంటి పిచ్చిజాస్తీగాఉంది. నేనుచెప్పింది వట్లా నమ్మేసిందమ్మా!

లక్ష్మిం— [సరోజతో] అయితే బాగానేఉందా?

సరో— నాకు నిజంగా నచ్చాడు నాన్నగారూ. నేనుకూడా బాగానే దాటించు కొచ్చాను. త్యాగరాజు, ఎక్కౌంట్లు—ఇవన్నీ మాటాడుకున్నాం. నాకు ఎక్కౌంట్లంటే కారప్పూసలా ఉంటుందనుకున్నాడులాఉంది.

లక్ష్మిం— [నవ్వుతో] బలే. తండ్రికి తగ్గకూతురువి నువ్వే, ఇలారా [వీపునిమురుతూ] మీ నాన్న దర్జాగా నడిపించు కొచ్చాడుకదూ? నీకిచ్చేస్త్రీ ధనంతప్ప మిగతా దంతా మీ ఇద్దరికీ ఉమ్మడిగా ఉండాలని చెప్పాను. రేపు అతను విడాకు లిచ్చినా, లేకనీకు నాలుగురాళ్లు దగ్గరుండాలన్నా ... ఏమంటావ్ కీడెంచి మేలెంచ మన్నాడు.

నర— [సరోజని కావలించుకొని] నా వెర్రితల్లీ!

లక్ష్మిం— వెర్రికేమొచ్చె, దానంత అదృష్టవంతురాలేదే? ఏదీ, ఆచచ్చుపీనుగ సుభద్ర ఎక్కడ చచ్చింది? [పిలుస్తూ] కావలిసినప్పుడే ఎక్కడో తగులడుతుంది. [మళ్లీపిలిచి] ఎక్కడేడుస్తోందో [సుభద్ర వచ్చింది. ఒసేయ్, ఒక శుభవార్త నీ చెల్లెలికి పెళ్లికుదిరిందే.]

సుభ— సరూ, నిజమేనా?

సరో— నిజమే.

సుభ— ఆఁ !

లక్ష్మిం— అదేనా నువ్వన వలిసినముక్క?

సుభ— నాకు చాలా చాలా సంతోషంగా ఉంది [ఏడుపు ఆపుకో లేకపోతుంది.]

లక్ష్మిం— [తెల్లబోయి అదేమిటే శుభమల్లా పెళ్లిజరగ బోతూంటే ఇది వెధవేడుపు ఏడుస్తుంది? పెళ్లివారెవరో కూడా అడగలేదు! నాగేంద్రమే, జరుగుమిల్లి వారబ్బాయి.

నర— పిచ్చిదానిలా అలా ఏడవకమ్మా.

సరో— చిన్నక్కా.

సుభ— [ఎక్కిళ్లు ఆపు కొందామని ప్రయత్నిస్తూ] ఏమీ అనుకోకండి. సరోజమీద ప్రేమ కొద్దీ—కనీసం నువ్వైనా సుఖపడతావు.

సరో— [ఆలోచిస్తూ] అవును.

లక్ష్మిం— [తనలో] దీని కంతకీ నీతి ఏమిటంటే, ఆ సత్యవతి గొడవ ఖంతో ఐదు వందల రూపాయలు, తణుకులో ఇల్లూ తగిలించిందన్న మాట.



# అంకం 2

[తణుకులో ఒక చిన్న యిల్లు. జులై నెల రాత్రి. వెనకాల తలుపులు తెరిచి వుంటాయి. ఆ గుమ్మంలోంచి చూస్తే ఒక చిన్న పూలతోట వెన్నెల వెలుగుల్లో స్పష్టంగా కనిపిస్తుంది, కుడిచేతివైపు రెండు గుమ్మాలున్నాయి. ఎడమచేతివైపు పడకగది గుమ్మం, అందులోంచి పందిరిమంచం కొస కనిపిస్తుంది. తెరలేచేసరికి అక్కడ సుబ్రహ్మణ్యం, సుభద్ర వున్నారు; సుభద్ర పార్సెల్ కడుతోంది.]

నాగే— తప్పకుండా అలాగే చేద్దాం సుబ్రహ్మణ్యంగారూ. మద్రాసులో నా స్నేహితుడు, సంపాదకుడికి మీ నవలగురించి వ్రాస్తాను.

సుబ్ర— నేను మీ ఋణం తీర్చుకోలేను. ఈవేళ తప్పకుండా వ్రాస్తారుకదూ ?

నాగే— తప్పకుండా వ్రాస్తాను.

సుబ్ర— ఆ ఉత్తరం నేను పోస్టుచేసిరానా ?

నాగే— ఏదీ, యింకా రాయలేదు; జాగ్రత్తగా ఆలోచించి రాయాలి. దానికి కొంత టైం పడుతుంది, మధ్యాహ్నం నాతో భోంచేశాడే—నా స్నేహితుడు ఆంజనేయులు—అతను వెళ్ళేటప్పుడు పోస్టుచేస్తాడులెండి.

సుబ్ర— మీ ఉపకారం మరచిపోలేను.

నాగే— మీరు ఈపూట భోజనంచేసి వెళ్ళండి.

సుబ్ర— అమ్మయ్యో! ఎక్కడా కడుపు కాళీలేదు. సుభద్రగారు పనిచెప్పారుకూడ.

నాగే— అయితే మీ యిష్టం. నేను వుంటాను మరి.

సుబ్ర— సెలవ్. మీ ఉపకారం మరచిపోలేను. [నాగేశ్వరరావు వెళ్ళిపోయాడు.]

సుభ— ఒక్క నిమిషం ఆగండి చాలు, తయారయిపోయింది.

సుబ్ర— ఫరవాలేదండీ; పోనీ తరువాత బండిలో వెడతాను. ఏ బండైనా ఒకటే. నాకు నిజానికి వాళ్ళదగ్గిరికి వెళ్ళటమంటేనే భయంగావుంది; సాధ్యమైనంత వరకూ వాళ్ళని తప్పించుకు తిరుగుతున్నాను. సీతారామయ్యగారూ, బాపనమ్మగారూ, ఆంజనేయులూ—వీళ్ళంతా ఓకేరకం మనుష్యులు. వాళ్ళని చూస్తేనే భయంనాకు. ఈ కాస్సేపూ నాకెంతో సంతోషంగా వుంటుంది.

సుభ— మీనవలగురించి మామరిది ఏవో ఉత్తరప్రత్యుత్తరాలు జరుపుతున్నట్లున్నాడు!

సుబ్ర— మద్రాసులో ఒక పెద్ద పత్రికవాళ్ళకి వ్రాశాను. ఆ కంపెనీ పెద్దలతో నాగేశ్వరరావు గారికి పరిచయం వుందిట! ఆయన నన్నుగురించి కంపెనీకి వ్రాస్తానన్నారు.

సుభ— [పార్సెల్ సుబ్రహ్మణ్యంచేతి కందిస్తూ] నాకేమీ ఒంట్లో బాగాలేదు; కొన్నాళ్ళదాకా విశ్రాంతి తీసుకుందా మనుకుంటున్నా నని చెప్పండి.

సుబ్ర— మీ ఆరోగ్యం బాగుండటంలేదా ?

సుభ— అహం. అంత విశేషంగా కాదనుకోండి, కాని డాక్టరే కొంతకాలం గాలి మార్పు కావాలన్నారు. అందుకని మా చెల్లెలు, నాగేశ్వర్రావుగారు ఇక్కడికి రమ్మని పట్టుపట్టారు. వాళ్ళూ చాలా మంచివాళ్ళే. అప్పుడే ఒక వారమైంది వేసి వూరొచ్చి. ఇప్పటికే కొంతనయమయింది.

సుబ్ర— మిమ్మల్ని మీ భర్తాస్నేకి విడిచిపెట్టి ఎవళ్ళదారిన వాళ్ళు పోయాక, [ఆగి] ఎంతకాలం ఇలా ఒంటరిగా మొల్చిరంగా బ్రతుకుతారు ?

సుభ— సరోజ పెళ్ళి తరువాత ఇలా వుండటమే మంచిదనిపించింది. [సుబ్రహ్మణ్యం నిట్టూర్చాడు] ఈరాత్రి ఎంత అందంగా వుందో! ఎంత చక్కగా వున్నాడో, చంద్రుడు! పట్టపగలు లాగావుంది వెన్నెల! ఈరాత్రి దారిపొడుగూనా వెన్నెల అందాన్ని ఆనందిస్తూ వెళ్ళే అదృష్టవంతులు మీరు.

సుబ్ర— [త్రుళ్ళిపడి] అయ్యో! అన్నట్టు వేనొక ముఖ్యవిషయం మరచిపోయాను. లక్ష్మింపతిగారికేదో ఉత్తరం వచ్చింది. తీరా వారు వెళ్ళాక వచ్చింది. కెలెక్టరేట్ నుంచి ప్రింటింగ్ కంట్రాక్టు గురించి అనుకుంటాను.

సుభ— అలానా? దానికోసం ఆయన కళ్ళు కాయలు కాచేలా ఎదురుచూస్తున్నారు.

సుబ్ర— నేనింక వెళ్ళిపోవాలి. ఆ ఉత్తరం ఆయన రాగానే యిచ్చేయండి. [వెళ్ళి పోతాడు]

[సుబ్రహ్మణ్యం వెళ్ళిపోగానే సుభద్ర వెనక్కితిరిగి, పులిచర్మం మీద కూర్చుని, కళ్ళుమూసుకొని ధ్యానించి, భజగోవిందం శ్లోకాలు చదువుకొంటుంది. కొన్ని నిమిషాలు గడిచాక అంజనేయులు, నాగేంద్రం, సరోజ, సీతారామయ్య, బాపనమ్మ వస్తారు.

నాగే— ఈవిడ కట్టుకున్న చీర బాగుందా ?

అంజ— వస్తుతః ఈవిడ పచ్చగా వుంటుంది కనుక, ఈవిడికి నల్లచీర ఎంతో బాగుం టుంది. [సుభద్ర వెళ్ళిపోయింది.]

నాగే— నల్లచీరకు తగ్గట్టుగా శాటిన్ పుల్ బ్లౌజ్ వేసుకొంటే చాలా అందంగా వుంటుంది.

సరో— పోనిస్తురూ వే నెల్లా వుంటే ఎమిటి?

అంజ— అంత విరక్తిగా ఎందుకు బతకాలి? అవకాశా లుండికూడా అనుభవించే యోగ్యత లేకపోతే——

బాప— ఇక్కడ ఉక్కపోస్తుంటే ఇక్కడే కూర్చునేకంటే ఆవుస్టైటపోయి కూర్చోకూడదు?

నాగే— ఎందుకూ, వెళ్ళిపోతాం. [నాగేంద్రం, సరోజ, ఆంజనేయులు, వెళ్ళారు.]

బాప— [భర్తతో] ఈ వెధవ పెళ్ళి అయితే కాని వల్లకాదని మీరే ఏడ్చారు.

సీతా— ఛి, ఛీ, నేనా?

బాప— చూడండి. దాని చోద్యపుగుణం. బోలెడు పనిపాటలు దాని చేతుల్లో ఉన్నాయా?—ఎక్కడా ఒక్క పనేనా ముట్టుకోదు. గనికలా కూచుంటుంది. నా మొహంమాస్తే అందరికీ అలా అనిపిస్తుంది కామాలు! నా ప్రారబ్ధానికి ఎవరు కర్తలు? ఘట్టింటి దగ్గర అల్లానే ఉండేదా? అష్టమైన చాకిరీ చేసేది.

సీతా— పోనిస్తూ; ఏదో చిన్నతనం. కాస్త వయస్సువస్తే వాళ్ళకే నాటుకుంటాయి.

బాప— మీరల్లా అంటూండండి; పాతికేళ్ళు వంటిమీద కొచ్చాయి. ఇంకా చిన్నతనమే.

సీతా— [విషయం మార్చాలని] ఈ ఇంటికి బారెడుదూరంలో వుంది గోస్తనీ నది. నీళ్ళకు అట్టే యిబ్బంది పడక్కర్లేదు.

బాప— వేసవికాలంలో నీళ్ళుండవు; వానాకాలంలో వరదలు. ఈ పడమటింటిగోడ ఈ దెబ్బతో ఎలాగ కూలిపోతుంది.

సీతా— కూలిపోతుందంటావా?

బాప— ఇంకా మెల్లగా అంటున్నారూ? ఎక్కడన్నా రాతిపునాది ఏడిస్తేకదూ? ఎప్పుడోప్పుడు ఎవరిశిలో బద్దలౌతుంది. ఇంతోటి కొంపకే ఈ వెర్రివెధవ—

సీతా— ఏ వెర్రి వెధవ?

బాప— మీ కొడుకే. ఎలక్ట్రిసిటీకూడా వేయించాడు.

నాగే— [వాకిట్లో] ఈ ఎలక్ట్రిక్‌పాలు వేయించానంటే ఎంత ముందుజాగ్రత్తో చూడు; యుద్ధానికి ముందే వీధుల్లో ఎలక్ట్రీస్తంభాలు పడ్డాయికదా; ఎప్పుడో ఒకప్పుడు తీగెలు వేయించి కరెంటు యిచ్చేస్తారు. వెంటనే ముందు మనకే కరెంటు ఇచ్చేస్తారు.

ఆంజ— చాలా మంచిపని చేశావు. [వాళ్లు మాటల ధోరణిలో వుండిపోతారు.]

బాప— పడమటింటిగోడ ఎలా బద్దలైందో చూడండి! పెళ్ళిహడావిడిలో కళ్ళు మూసుకు పోయ్యాయి మనకి.

సీతా— ఫరవాలేదు.

సరో— (ఆంజనేయులు నాగేంద్రాలతో వస్తూ) ఇక్కడ కూర్చుంటే ప్రాణాలు లేచి వస్తాయి కదండీ.

బాప— ఆ, తప్పకుండా లేచిపోతాయి. [భర్తతో] ఏమండి ఒకసారి రిలారండి. అలా కాలవకేసి వెడదాం. [ఇద్దరూ వెళ్ళిపోతారు.]

నాగేం— ఒకేయ్ అంజి. ఈ పక్క గదిలో మేడ మీదికి మెట్లున్నాయి. ఆ గది మా పడకగది.

సరో— [ఆంజనేయులు వినకుండా మెల్లగా] అబ్బా పోనిస్తురూ!

నాగేం— [గట్టిగా] నాన్సెన్స్! అదేమిటే! ఎందుకు చూపించ కూడదూ? (తలుపు తీసి, ఆంజనేయులుతో) ఒకేయ్ చూడరా అబ్బీ.

ఆంజ— చాలా బాగుంది.

నాగేం— కాకిగూడులా లేదు? ప్రేమపక్షులకి శీతాకాలం బాగుంటుంది. [సరోజ చుబుకాన్ని పట్టుకోబోతాడు]

సరో— [విదిలించుకుని] అబ్బ! మీకు వేళా పాళా లేదు.

నాగేం— అంజికూడా మనింట్లో వాడే, పైవాడు కాడు. పోనీలే లోపలకెళ్లి మైసూరు పాకాలు, లడ్డు, ఒక పళ్లెంలోనూ కారంపప్పులు ఒక పళ్ళెంలోనూ పెట్టి సిద్ధంగా ఉంచు.

ఆంజ— ఇప్పుడే కదటయ్యా బాబూ భోంచేశాను. మళ్ళీ ఇవన్నీ ఎందుకు?

నాగేం— నీకోసం కాదురా అబ్బీ, నువ్వు స్నేహితుడువి. ఇలాంటి దొంగమర్యాదలన్నీ కొత్తవాళ్ళకే చేస్తాం. ఎడ్వొకేట్ శ్రీహరి అని ఈ వూళ్ళో ఒక యమ్.ఎల్.ఎ లే. ఆయనకి పబ్లిక్ వర్క్స్ శక్రెటరీ పదవి వచ్చింది. వాళ్ళకి టీపార్టి ఇద్దామని ఇక్కడికి ఆహ్వానించాం.

సరో— ఆవిణ్ని కూడా పిలిచాంగా?

నాగేం— ఔనౌను. ఇద్దర్ని పిలవటమే ఇంగ్లీషు మర్యాద.

ఆంజ— ఇంత రాత్రప్పుడా?

నాగేం— ఏం చేస్తాం చెప్పు? కలెక్టరు గారింటికి భోజనానికి వెళ్ళారు? తెల్లారితే వెళ్ళిపోతారట. అందుకని కలెక్టర్ గారింట్లో భోజనాలయ్యాక దారిలో ఇలా రమ్మని కోరాను. బాగా డబ్బున్న వాళ్లులే. గొప్ప ఇన్‌ఫ్లుయన్సు కూడా ఉంది. పరోపకారబుద్ధి ఉన్నవాళ్లు. ఏమిటి చెప్తున్నాను చెప్మా? (భార్యతో) ఓ యస్, నువ్వు వెళ్లి అవన్నీ సిద్ధంచేసి ఉంచు. ముసలావిడకి రాత్రిళ్లు కళ్ళు కనిపించవ్. ఆపని నువ్వే చెయ్యాలి. భార్యల పనల్లా విధేయతగా ఉండటమే. ఊఁ వెళ్ళు.

సరో— వెడుతున్నాను. (వెడుతుంది, సుభద్ర వస్తుంది.)

సుభ— (నాగేంద్రంతో) మీరు సుబ్రహ్మణ్యానికి ఏదో ఉత్తరం వ్రాసిస్తానన్నారట. మరిచిపోలేదుకదా బావగారూ.

నాగేం— లేదులెండి.

సుభ— మీ ఉత్తరం అతనికి ఉపకారం చేయొచ్చు.

నాగేం— అవునవును. ఆ సంగతి నాకు తెలుసు. పోదినా మీరు లోపలికెళ్లి కాస్త శుభ్రమైన బట్టలు కట్టుకోండి. మీకు పుణ్యముంటుంది.

సుభ— (తెల్లబోయి) అలాగేలెండి (వెళ్తుంది.)

అంజ— ఎవర్రావిడ? ఎప్పుడూ ముంగిముషాణంలాగే ఉంటుంది.

నాగేం— (నిర్లక్ష్యంగా) కొంచెం దూరంచుట్టంలే పాపం! బీదది. ఎప్పుడూ రామా, కృష్ణా, అంటూ కూర్చుంటోంది. (కొంచెం సిగ్గుపడి) పొట్టకోసం నానా కష్టాలు పడుతోంది.

అంజ— తప్పేమిల్లే. అదేమీ అవమానం కాదు.

నాగేం— నాకు తెలుసా సంగతి. కాని ఏమిటో గోపికా వస్త్రాపహరణాలుగట్రా గీస్తుంది. (పకాపక నవ్వి) అసహ్యం వేయటంలేదూ? నిన్న. అంతెందుకు? ఎవరో ఒకావిడొచ్చి కొన్ని బొమ్మలు గీసిస్తే నాలుగురాళ్లు అదనంగా ముట్ట చెపుతానంది. ఒప్పుకోలేదు. ఎందుకో తెలుసా?

అంజ— (విసుగ్గా) ఎందుకు?

నాగేం— (ఇకిలిస్తూ) ఆవిడ మొగుణ్ని వొగిలేసిందిట అందుకని. (నవ్వుతాడు) మళ్ళీ వారంరోజుల్లో ఒకసారి నువ్వు తప్పకుండా రావాలిరా అబ్బాయీ. (భుజం తట్టి) ఏం వస్తాగా?

అంజ— ఓ. యస్. తప్పకుండా వస్తాను. [ఆగి] మీ ఆవిడ అందంగా వుంటుందిరా.

నాగేం— [ఉబ్బిపోయి] ఫరవాలేదు, ఏం?

అంజ— చాలా తెలివైందికూడా.

నాగేం— పోరా ?

అంజ— నిజంరా.

నాగేం— ఓ. యస్. నేను ఖచ్చితంగా చెప్తావిను. ఆవిడసంగతి నాకు తెలుసు. కాదని దబాయిస్తే లాభంలేదు. సరోజ వట్టి శుంఠ. అందుకనే దాన్ని పెళ్ళాడాను.

అంజ— నేనలా అనుకోను. చాలా చదువుకొంది.

నాగేం— చదువుకొందా! ఓరి దేవుడా! నువ్వు చదువుకొందే అన్నావ్! చేతికేది అందితే అదే చదువుతుంది. నాకు పెళ్లికాకపూర్వం వాళ్ళ నాన్నగారు అచ్చేసిన కాయితాల ప్రూఫులన్నీ ఈవిడే చదివేదిట. వాళ్ళనాన్న పుస్తకాలన్నీ బస్తాకొద్దీ మోసుకొచ్చి ఇక్కడ వెలివేసింది. అవన్నీ చదివిందిట!

అంజ— అయితే—

నాగేం— అయితే, ఆవిడ చదివినదాంట్లో ఒక్క అక్షరంకూడా ఆవిడకి అర్థంకాదు. ఒక్క అక్షరంకూడా! ఎందుకు, నిన్న ఆవిడ ఏదో పుస్తకం చదువుతోంటే దాని రచయిత ఎవరా అని చూశాను. చలం; గుడిపాటి వెంకటచలాన్ని ఎరుగుదువ్ కదూ?

అంజ— [తల తిప్పుతూ] తెలుసు.

నాగేం— నాకూ అతనిపేరు తెలుసు. దేవుడి దయవల్ల ఒక్క అక్షరంకూడా అతనుచదవలేదు. అబ్బాయి! చెప్తావిను. సరోజాందే వట్టి స్టుపిడ్ అనుకో. అయితే నేం, అందంగా వుంటుంది; చీర ఎలా కట్టుకోవాలో ఆమెకు తెలుసు. ఇల్లు బాగా అలంకరిస్తుంది. కొంచెంచెవి తేచాలు, చటుక్కున అర్థం చేసుకోలేదు. అదే నాకు కావలసింది కూడా.

ఆంజ— అది చాలా మంచిదే. కాని, అంతట్లో ఒక తెలివితక్కువ దద్దమ్మని పెళ్ళి చేసుకున్నా ననుకోవటం శుద్ధ పొరపాటుసుమా.

నాగేం— నీకెలా తెలుసు ?

ఆంజ— ఎవరో కవిగారితో నువ్వు మాట్లాడుతున్నంతసేపూ, నీ భార్యా, నేను— ఇద్దరం పిచ్చాపాటి చెప్పుకున్నాం.

నాగేం— ఆవిడ నీతో మాట్లాడిందీ?

ఆంజ— అనర్గళంగా.

నాగేం— అద్భుతాలు లేకుండా పోవు. అదేమిటో మేమిద్దరం కూర్చున్నప్పుడు ఒక్క మాటకూడా మాట్లాడదు.

ఆంజ— నువ్వో ?

నాగేం— నేనూ అంతే.

ఆంజ— ఛి ఛీ. అదేం బాగోలేదురా.

నాగేం— అనవసరంగా కలగజేసుకోవటం నాకిష్టంలేదు. అయినా, నిజానికి... నేనింకా సరోజని సరిగ్గా అర్థం చేసుకోలేదు.

ఆంజ— కాపరానికొచ్చి ఆరునెలలైందనుకుంటాను.

నాగేం— నాలుగు నెలల వారంరోజులైంది. ఆ రోజుల్లో మా వ్యాపారం చాలా ముఖ్యంగా వుండేది. వారానికోసారి— ప్రతి శనివారంగాని— మా మామగారూ అత్తగారూ ఇక్కడికి కొస్తూంటారు. ఇవేళ ఇంకా రాలేదనుకో; ఇంకో గంటో, అరగంటలోనో వస్తారు. ఎప్పుడేనా కాస్త తీరుబడిగా ఏదైనా నాలుగు కబుర్లు చెప్పాలనుకుంటాను చెపితే నవ్వుతుం కాని— మూర్ఖురాలి నవుస్తోన్నట్టుంది, అందుకని—

ఆంజ— ఊఁ, అందుకని ?

నాగేం— అందుకని, చడీచప్పుడూ లేకుండా ఊరుకొంటాను. ఏమీతోచక పోతే ముద్దుపెట్టుకుంటాను.

ఆంజ— ఆవిణ్ణి మనసారా ప్రేమిస్తున్నావుకదూ ?

నాగేం— అవును.

ఆంజ— ఆవిడో ?

నాగేం— ఆవిడా అంతే.

ఆంజ— నువ్వుచాలా అదృష్టవంతుడివి.

నాగేం— ఇతర విషయాలు మాకేమీ తెలియవు. నా అభిరుచులేమిటో ఆవిడకీ, ఆవిడ అభిరుచులేమిటో నాకూ అంతా అగమ్యగోచరం.

ఆంజ— పెళ్ళిచూపులునాడు ఏమీ తెలుసుకోలేదో? ఆవేళ ఏమీ మాట్లాడుకో

నాగేం— మాట్లాడుకోకేం? పదినిమిషాల పాటు మాట్లాడుకున్నాం. డబ్బు సంగతులన్నీ ఆ సమయంలో సులువుగా పరిష్కారమై పోయాయి.

ఆంజ— డబ్బు సంగతికొస్తే చాలా జాగ్రత్త పడతావని తెలుసులే.

నాగేం— నిజానికిది కూడా ఒకరకం వ్యాపారమేకదా. [నవ్వుతాడు.] నేనూ మా వాళ్లూ కలిపి మా మామగారికి బలే టోకరా ఇచ్చాంలే! [మళ్ళీ నవ్వుతాడు.]

ఆంజ— ఉష్. నీభార్యవస్తోంది. [సరోజ వచ్చింది. ఆంజనేయులు వెళ్ళాలనిలేచాడు.] నేనింక వెళ్ళిపోవాలండీ.

నాగేం— ఒక ఉత్తరం ఇస్తానుండు. [వాచీకేసి చూసి] ఇంకా ఇరవై నిమిషాలుంది.

ఆంజ— సరే?

నాగేం— ఓ, యస్, ఒక నిముషం ఆగు. రాసిపట్టుకొచ్చేస్తాను. స్టేషన్ దాకా వస్తానులే, నాలుగడుగులేగా. [వెళ్ళాడు]

సరో— మీ గురించి ఆయన అంటోంటే విన్నాను. మీరురావటం నాకు చాలా సరదాగా ఉంది.

ఆంజ— ఎంత మాటన్నారు!

సరో— నాకు పెళ్ళయినప్పటినుంచీ ఎప్పుడూ ఇంత ఇదిగా మాట్లాడలేదు.

ఆంజ— నాగేంద్రం అంతమాటకారి కాడండీ.

సరో— మీరిద్దరూ బాల్యస్నేహితులు కదండీ?

ఆంజ— అవును. పదిహేనేళ్ళబట్టి మాకిద్దరికి పరిచయం. ఇంచుమించు ఒక కంచంలో తిని ఒక మంచం మీద పడుకున్నాం.

సరో— మీరు చెప్పండి. ఆయనకి దేవుడి మీద నమ్మకం ఉందా?

ఆంజ— నాగేంద్రానికా! [పగలబడి నవ్వుతూ] అతను పచ్చిభౌతిక వాది. అతని కిలాంటి నమ్మకాలేమీ లేవు.

సరో— పోనీలెండి! ఆయనకి సంగీత మంటే ఇష్టమేనాండి? అంటే కృతులూ, అష్టపదులూ అలాంటివి: త్యాగరాజు కీర్తనలు!

ఆంజ— సినిమాపాటలంటే ఇష్టం. [సరోజ ఆశ్చర్యపోతుంది.] ఎందుకలా తెల్లబోతారు? ఓ, మరచి పోయాను. అతను బుల్ బుల్ వాయిస్తాడు. మా నాగేంద్రం మంచివాడే కాని, బాగా ఖచ్చితం. కొరడాలాంటి మనిషి.

సరో— [నవ్వుతూ] మీకు మీ స్నేహితులమీద సదభిప్రాయం లేదనుకుంటాను.

ఆంజ— నన్ను బాధిస్తోందేమిటంటే మీలాంటి అమూల్యధనాన్ని కలిగి ఉండికూడా దాని విలువను గుర్తించకపోవటం. ఆఁ నేను పెళ్ళిచేసుకొనేటప్పుడు.

సరో— త్వరలో పెళ్ళిచేసుకో బోతున్నారా?

ఆంజ— ఏమో నాకు తెలియదు. (ఆలోచించుకొంటూ) నన్ను ఏ ఆకాశపు జౌన్నత్యాలలోకో తీసుకుపోగల, భూమ్యాకాశాలలోని ప్రతివిషయాన్ని గాలించగల మీలాంటి త్రిలోకసుందరిని పెళ్ళాడే భాగ్యంనాకు కలిగేటట్లయితే పెళ్ళిముందు ...

సరో— ఆవిడకోసం వెదకండి. ఆవిడ తేలిగ్గానే దొరుకుతుంది.

ఆంజ— మళ్లీ మీ అంత అందంగా ఉండాలి, మీరెంతో అందంగా ఉంటారు. సంగతి మీకు తెలుసా?

సరో— (తమాషాకి) పొరబాటున నన్నే ప్రేమిస్తున్నారా ఏమిటి?

ఆంజ— మిమ్మల్ని ప్రేమించటమంటే ఒక అధిదేవతకి సాష్టాంగ పడటం అయినప్పుడు ఒక కోరికకి.

సరో— (నవ్వుతూ) సవ్యంగా మీ కాలాన్ని మా కుటుంబ స్నేహితుడుగా వ్యయం చేయండి. నేనే మీరయితే ఇలా తొందరపడేదాన్ని కాను. ఇంకోచోట ఇలాంటి ఉపన్యాసాలే చేసినట్లయితే మీకు కొంతన్నా లాభం ఉండేది. నాకు వివాహంమీద పూర్వీకుల నమ్మకాలే ఉన్నాయి.

ఆంజ— అది ఏమి కానీ అవి నాలా గొప్పవీ, ఉన్నత మైనవీ అనుకుంటాను.

సరో— మీరు చాలా మంచివారండీ. అయినా పొరపాటు పడ్డారు. నా ఉద్దేశాలన్నీ సర్వసాధారణంగా అందరికీ ఉండేవే. నాజీవితం నాపిల్లలకీ నా భర్తకీ అంకితమైతే చాలనుకుంటాను.

ఆంజ— పిల్లలేమిటి?

సరో— (మామూలుగానే. అయినాకొంచెం ఉద్రేకంగా) అన్నిటికంటే నాకు పిల్లలే ఎక్కువ. నేను చెప్పదలచింది మీకు చాలా నవ్వుతాలుగా తోచవచ్చు. అయినా నాకు తొలిసారి పిల్లపుట్టినరోజునే నా జీవితంలో పర్వదినంగా భావిస్తాను. ఆరోజుకోసం తపస్సు చేస్తాను.

ఆంజ— (ఉపాయంగా ఆమె దయకోసం) మళ్ళీ మీదర్శనం చేస్తాను.

సరో— (నవ్వుతూ) మీ ఇష్టం వచ్చినప్పుడల్లారండి.

[నాగేంద్రం వచ్చాడు]

నాగేం— అరే, అబ్బీ! పాపం సుబ్రహ్మణ్యం చంపాడురా. ఈ ఉత్తరం కాస్త మెయిల్‌కి అందించేద్దూ. టైమయింది మరి. లే.

ఆంజ— లేస్తున్నాను. (లేచి) నువ్వు స్టేషన్‌కి వద్దులే. ఈవిడ ఒక్కరూ ఉంటారు.

నాగేం— ఫరవాలేదు. మామావగారూ వారూ వస్తున్నారు. అందుకోసం వెళ్ళినట్టూ ఉంటుంది; నిన్ను దిగబెట్టినట్టూ ఉంటుంది.

ఆంజ— (సరోజతో) ఉంటానండీ. (నాగేంద్రంతో) ఇందాకటి ఆవిడతో చెప్ప లేదు. (నాగేంద్రం తెల్లబోతాడు.) ఇందాకా మంచి చీరకట్టుకొని ఉన్నావ్ ఆవిడ.

నాగేం— ఓహో ! ఆవిడా నేను చెప్తాలే. ఇదిగో ఆవిడే వచ్చింది.

[సుభద్రవచ్చింది; ఆంజనేయులు ఆవిడిదగ్గర సెలవుతీసుకుంటా నునుకుం టూంటే లక్ష్మింపతి, నరసమ్మగారూ వచ్చారు. వారితో నాగేంద్రం ఆంజనేయుల్ని పరిచయం చేస్తూ, తొందరగా] నాస్నేహితుడు ఆంజనేయులు, ఆతను రైలు కెళ్ళాళి.

ఆంజ— క్షమించాలి. [నాగేంద్రంతో వెళ్ళి పోతాడు].

లక్ష్మిం— ఇలారా, సుభద్రా; నీకో శుభవార్త చెప్తాను. మీ పెద్దమ్మరమ్మంది. జ్ఞాపకం లేదూ ? కలకత్తాలో ఉండే, ఆవిడా. ఆవిడ చరస్థిరాస్థులన్నీ నీపేరా, సత్య వతిపేరా పెట్టింది. అట్టేకాదులే; ఆరువేల రూపాయలు; అది మీఇద్దరికీనీ. నాకందులో కానీ రాదను కో. నేనంటే ఆవిడకి అరికాలిమంట నెత్తికెక్కు తుంది. అదేమిటే పిచ్చిదానా, ఏమిటి సంగతి ? మీ పెద్దమ్మ చచ్చిపోయిం దని శోకాలు తీస్తావాఏమిటి కొంపతీసి ? నువ్వుపుట్టాక ఆవిడ ఎలా ఉం టుందో ఎరగవ్ కదా ! నిజంగా నీ అదృష్టం బాగుందనుకో. ఇక, మామూ లుగా నా అనస్థలు నాకు తప్పవ్. [సుభద్ర మొహం ఇబ్బందిగా పెడుతుంది] సరేలే. మీ అక్కయ్య ముందు కాకినాడనుంచి రావాలికదా !

నర— ఏమండీ, మీరు కలకత్తాలో ఉందన్నారుకదూ ?

లక్ష్మిం— కలకత్తాలోనా ? అదేమిటే, పిచ్చి నాయుడూ ! కలకత్తాలో కాదు; కాకి నాడలోనే ఉంటోంది. కాకినాడ వదలి ఎక్కడికీ వెళ్ళలేదు. కలకత్తాదేనికి ? [సుభద్రతో] మీ అక్కయ్య కాకినాడనుంచి రాక తప్పదు. ఇక్కడి భూములూ అవీ స్వాధీనం చేసుకోవాలికదా. అవి అమ్మేస్తామనుకో; అయినా సత్యవతి రావాలి. ఆవిడవచ్చిందంటేచాలు, జనం గుసగుసలు ప్రారంభిస్తారు. చాలామందికి నాకు ముగ్గురు కూతుళ్ళున్నట్లే తెలియదు. [సరోజతో] ఇది నీపెళ్ళి కాకపూర్వమే జరగలేదు, ఇంకానయమే.

సుభద్ర— ఆవిడరాక తప్పదా, నాన్నా ?

లక్ష్మిం— వచ్చితీరాలి. కాయితాల మీద సంతకాలు పెట్టడానికి మీరిద్దరూ లాయర్ దగ్గరికి హాజరవ్వాలి.

సుభద్ర— నేను లాయర్ దగ్గరికి వెళ్ళను.

లక్ష్మిం— నువ్వువెళ్ళక పోతే సత్యవతికి ఆస్థిదక్కదు. అందుకు నువ్వుకూడా వెళ్ళాలి.

సుభద్ర— పోనీ వెడతాననుకోండి. అయినా జాగ్రత్తగా ఆలోచిస్తాను; అవసరమైతే ఎవరి సలహో అన్నా తీసుకొంటాను.

లక్ష్మిం— నీ ఇష్టం. కాని, ఈ సంగతి కాకికన్నా తెలియకూడదు. మీ ఇద్దరిలోనే ఉండాలి, తెలిసిందా ?

సరో— అలాగే నాన్నా.

సుభద్ర— [ఒక ఉత్తరం తీసి అందిస్తూ] సుబ్రహ్మణ్యం మీకీ ఉత్తరం ఇమ్మని ఇచ్చాడు; కలెక్టరేట్ నించి వచ్చిందట.

లక్ష్మిం— [చదువుతూ] కొంపమునిగింది! శ్రీరామ్మూర్తిగారికి కంట్రాక్టు ఇచ్చేశారట! శ్రీరామ్మూర్తి! నేననుకుంటూనే ఉన్నాను. అనుకుంటూనే ఉన్నానుసుమీ, నాగేంద్రం పెత్తండ్రి నాకు కావాలని ప్రాయశ్చిత్తంచేశాడు. [సరోజ] అత్తారింటి కొచ్చింతర్వాత ఒక్కసారన్నా మీ పెదమామ గారింటికెళ్ళావు? లేదు. నాగేశ్వర్రావో? అతగాడూ అంతే. కానీ మీ అత్తగారూ, మామ గారూ గాని? వాళ్ళు మాత్రం తక్కువ తిన్నారా! అందుకనే ముసలి వెధవ, కడుపుమంటతో నాగొంతుక కోసేశాడు. ఇంతే. ఇంక నాచేతిలో దమ్మిడీ ఆడదు. పోనీ నువ్వన్నా ఎందుకేడిశావ్ కాదూ?

సరో— మా అత్తగారు వెళ్ళొద్దన్నారు.

లక్ష్మిం— ఆం! మీ అత్తగారు వెళ్ళొద్దన్నారా! సరే, కానీయ్. వాళ్ళతో నాలుగూ ఝాడించేస్తాను. ఈదెబ్బతో మీ అత్తగారికీ, మామగారికీకూడా బుద్ధిరావాలి. నావిధినేను నిర్వర్తిస్తాను. నేనే సూటిగావెళ్ళి నాగేంద్రం పెత్తండ్రితో మాట్లాడతాను. ఆ ముసలి వెధవతో నాలుగు సగదాగా మాట్లాడి నాపని చేయించుకుంటాను—వెధవపని అయితే అయింది, తప్పుతుందా? వాళ్ళు వెళ్ళొద్దన్నారూ? నా తడాఖా చూపిస్తాను. నువ్వా, నువ్వు వుత్త చచ్చు పీనుగవి—వాళ్ళు వెళ్ళొద్దంటే మానేస్తావా? నీకన్నా జ్ఞానం వుండొద్దూ? నీకు రాజాలాంటి సంబంధం చేశాను; ఇంత మంచి సంబంధం వస్తుందని కలలోనన్నా అనుకున్నావా? ఆమాత్రం విశ్వాసమన్నా లేదుటేసీకు? వాళ్ళకి తగ్గ ప్రాయశ్చిత్తం—

నర— [కంగారుపడి] ఉష్!

లక్ష్మిం— వాళ్ళకి ప్రాయశ్చిత్తం చెయ్యలేనంటావా?

నర— ఎందుకు చెయ్యలేరూ? గట్టిగా అనకండి బాగుండదు.

లక్ష్మిం— ఇక్కడ లేరులే. వున్నా సరోజకి పెళ్ళయిపోయిందిగా; భయంలేదు. [గొంతుక తగ్గించి, కోపం తగ్గకుండానే] వీళ్ళపని పట్టానుందు.

నర— మీ రేం చేద్దామని.

లక్ష్మిం— వీళ్ళని నొక్కిపెట్టే వుంచానులే. వీళ్ళ తెగులు కుదురుస్తాను.

సరో— పాలు పొంగుతున్నట్టున్నాయి. రా అక్కా చూద్దాం. [వెళ్ళిపోతారు]

లక్ష్మిం— సరే, కానియ్ చెప్తాను.

[బాపనమ్మ, సీతారామయ్య వచ్చారు.]

బాప— ఇదిగో, అన్నగారు వచ్చారూ? చూడండి, ఆ పడమటింటిగోడ కూలిపోయే టట్టుందండి.

లక్ష్మిం— నేను మీ గోడనుగురించి ఆలోచించడంలేదు.

బాప— తీరా కూలిపోతే, దానికోసం డబ్బు ఖర్చుపెట్టలేం.

లక్ష్మిం— నేను గోడగురించి ఆలోచించడంలేదు. అంతకంటే ముఖ్యమైనదాన్నిగురించి ఆలోచిస్తున్నాను. మీకేమీ దూరాలోచన లేకన్నాపోవాలి; లేదా తల్లి దండ్రుల కెలాంటి బాధ్యత లున్నాయో మీకు తెలియకన్నా పోవాలి. ఇలా అనాల్సి వచ్చినందుకు విచారిస్తున్నాను.

బాప— మేము గోడకూలి పోయేటట్టుంది మొర్రో అంటే మమ్మల్ని పైగా తిడు తున్నా రేమిటి ఖర్మం!

లక్ష్మిం— నేనూ తండ్రినే. నాకూ నా పిల్లలంటే పంచప్రాణాలున్నూ. వాళ్ళ అభి వృద్ధి చిక్కుల్లో పడినప్పుడు తరువాత వాళ్ళ కుపయోగపడే వాళ్ళతో కొంచెం మంచిగా వుండాలనే నేనూ ప్రయత్నిస్తాను.

బాప— [ఒక్క నిమిషం ఆలోచించి] ఓహో. మీ బావగారిమాటా ?

లక్ష్మిం— ఆ సంగతి మీకు తెలుసు. మీకు తెలిసుండే మీరలా చేశారు. [బాపనమ్మ నిరగబడి నవ్వుతోంది.]

సీతా— అదేవిటే. ఏమైనా అంతనవ్వు పనికిరాదు ఆడదానికి.

బాప— బాగుందండోయ్; నే నెందుకు నవ్వకూడదు ? మీరు నన్ను క్షమించరను కుంటాను, ఆయనా మీరుకూడా.

లక్ష్మిం— మీరిలా అనుకుంటే నేనే మనుకుంటున్నానో చెప్పేస్తాను. మీరు స్వార్థ పరులైనా అయుండాలి; లేక మూర్ఖులైనా అయ్యుండాలి.

సీతా— బావగారూ !

బాప— మీరుండండి చెప్తాను. ఆయనకి నేను సమాధానం చెప్తాను.

నర— అబ్బ ఊరుకోండి.

లక్ష్మిం— నోర్మూయ్యి. స్వార్థమా, మూర్ఖత్వమా? ఏమిటో చెప్పండి. మీబావగారు డబ్బున్న వాడా కాదా?

బాప— (ఒక్కనిముషం తటపటాయించి ఆఖరికి) కాదు.

లక్ష్మిం— (కొయ్యబారిపోయి) కాదు! కాని.

బాప— మీరు అనదలచుకున్నది నాకు అర్థమయింది. మీకు కావాల్సిన జవాబుచెప్పే శాను. ఆయన్ని ఈడ్చి తన్నినా దమ్మిడీరాలదు.

లక్ష్మి— ఏమిటి? ఆయన దగ్గర బోలెడు డబ్బుండాలని విన్నాను?

బాప— అవును. ఉండేది. ఇప్పుడాడబ్బు ఇంకొకళ్ళ దగ్గరఉంది. ఆయన దగ్గర మాత్రం కాదు.

లక్ష్మిం— నిజం?

బాప— అందుకే మేం ఆయన్ని పూచిక పుల్లతో సమానంగా చూస్తున్నాం.

లక్ష్మిం— కాని నాకు సరిగా అర్థంకాలేదు. (ఒక్కక్షణం ఆగి. కొంచెం తటపటాయించు కొని) ఎంతకాలమయింది ఇలాజరిగి?

బాప—ఆరు నెలలకి పైగా అయింది.

లక్ష్మిం— అయితే అప్పటికే మీకు తెలుసన్నమాట.

బాప— ఆఁ. తెలుసు.

లక్ష్మిం— అయినా ఆసంగతి మీరు నాతో చెప్పలేదు.

బాప— మీరు అడిగితే కదా!

లక్ష్మిం— ఆసంగతి చెప్పాల్సిన విధి మీకుంది. అలా చెప్పక పోవటం మోసం.

బాప— ఏమండోయ్!

లక్ష్మిం— నన్ను దగాచేశారు.

బాప— దగాచేశామా.

లక్ష్మిం— ఆఁ దగాచేశారు.

బాని— మీనోటికొచ్చినట్టు మాట్లాడకండి. మీపాటి ఆస్థిపాస్తులు మాకూ ఉన్నాయి. మీ అచ్చాఫీసు కెంత లాభం వస్తుందో మా వ్యాపారంలో కూడా ఆపాటిలాభం వస్తోనేఉంది.

లక్ష్మిం— అలాఅని ఎవరూ అనటం లేదు. అయినా మిమ్మల్నొకటి అడగాలను కుంటున్నాను.

బాప— ఇంక మమ్మల్నేమీ అడక్కండి. మీకేమీ సమాధానం చెప్పాలనుకోవటం లేదు మేం. మమ్మల్నెలాంటి మాటలన్నారో మావాడితో చెప్పాలను కుంటున్నాను.

నర— వొదినగారూ!

బాప— పోదాంరండి! (బాపనమ్మ మళ్ళగానే సీతారామయ్య ఒక్కసారి దీర్ఘంగా నిట్టూర్చి ఆమెను అనుసరించాడు.)

నర— మీవరస ఏం బాగోలేదు.

లక్ష్మిం— ఏఁ! ఏమీ కొంపమునిగిపోలేదు. కొంచెం ఆలోచిస్తే ఇదే మంచిపనేమో అనిపిస్తోంది. నాకేం విచారంలేదు. సంతోషంగా ఉందికూడా.

నర— నాకేం అర్థంకావటంలేదు.

లక్ష్మిం— ఆసంగతి నాకు తెలుసు, నీకెప్పుడూ అర్థంకాదు. తర్వాత చెప్తాలే. (సరోజ వచ్చింది.) అమ్మాయి నీసంగతే అనుకుంటున్నాం. మీ ఆయన వ్యాపారం చాలా ఒడుదుడుకుల్లో వుందని విన్నాను. నిజమేనా?

సరో— ఆదేదో వాళ్ళు వాళ్ళు పడతారు; నాకలాంటివేవీ తెలియవ్ నాన్నగారూ!

లక్ష్మిం— ఏడిసినట్టుంది. భోజనాలదగ్గరా, పడకగదిలోనూ ఇంకేం మాట్లాడతావు, ఇవి కాక?

సరో— మే మేమీ మాట్లాడుకోం.

లక్ష్మిం— ఈ మాత్రం దానికి మాట్లాడుకోవాలా ఏమిటి? ఏదో మనోవ్యధతో కుర్చీలో పడుకొని విచారంగా ఆలోచించు కొంటున్నాడో, లేక పెళ్ళి నాడులా హుషారుగా ఉన్నాడో, ఆ మాత్రం కనిపెట్టలేవు?

సరో— ఏమో, ఎప్పుడూ ఒకలాగే ఉన్నారు. ఒక సారి ఒకలాగ, ఒక సారి ఒక లాగ ఉంటే ఏమో అనుకోవచ్చుగాని ఆయన ఎప్పుడూ ఒకలాగే ఉన్నారు.

లక్ష్మిం— ఉత్తచవ్వ పెద్దమ్మవని నాకు బాగా తెలుసులే. ఇప్పుడే నీ పరిస్థితులెలా ఉన్నాయో తెలుసుకోవటం మంచిది.

సరో— నాకెందుకు చెప్పండి!

లక్ష్మిం— నువ్వు అడిగి తీరాలి అంతే. నీకు రేపు చిన్న పిల్లలు పుట్టొచ్చు; తెలిసిందా?

సరో— [నిట్టూర్చి] అందుకోసం కాకపోతే నేను ఉరేసుకు చావటం మంచిది.

లక్ష్మిం— చెత్త, అదేం మాటలే. ఆ విషయం తర్వాత చర్చించుకుందాం. ఒకటి మాత్రం జ్ఞాపకం ఉంచుకో; నీ పిల్లలు మట్టికొట్టుకోకుండా ఉండాలంటే నీభర్త వ్యాపారం మీద ఒక కన్ను వేసి ఉంచాలి; తెలిసిందా?

సరో— అలాగే.

[నాగేశ్వర్రావు వచ్చాడు]

నాగే— [కంఠంలో కోపం ధ్వనింప చేస్తూ] మామగారూ, ఇదేమి బాగోలేదండీ. మావాళ్ళని మీరుదగాకోరులన్నారని మా అమ్మా నాన్నా నాతో ఇప్పుడే చెప్పారు. నాఖర్మేమిటో కాని, ఒకరోజు కూడా మనశ్శాంతిగా గడపలేక పోతున్నాను. మీరు గుమ్మంలో కాలు పెట్టినప్పట్నుంచి కజ్జాకు కాలు దువ్వటమే మీపని. పైగా దగాకోరులని వాళ్ళని తిట్టారు. అదేమీ మంచిది కాదు. వాళ్ళకి కోపంగా ఉంది. తప్పుకూడా వాళ్లదికాదు.

లక్ష్మిం— అబ్బేబ్బే. అదేమీ కాదోయ్.

నాగే— మా అమ్మ మండి పోతుంది.

లక్ష్మిం— అదేం మంచి పనికాదు. ప్రజలు దెబ్బలాడుకోవటమంటే ఏమిటో నీకూ తెలుసు కదా!—ఒకళ్లు ఏదో మాటంటారు; దాని మీద ఇంకో మాట వస్తుంది. పూర్తిగా నమ్మలేని మాటలు కూడా వస్తాయి. సరే, దానికేం— నేనెంత తగు మనుష్యుణ్ణో రుజువుచేసుకోటానికని తిన్నగా మీ అమ్మగారి దగ్గరకెళ్లి క్షమార్పణ కోర్తాను. సరా? [భార్యతో] రావే; గ్రంధమంతా నువ్వే నడిపించాలి.

నాగే— మీరే నాస్థానంలో ఉంటే, ఈ రసాభాసంతా ఎంత ఇబ్బందిగా ఉంటుందో మీకే అర్థమయ్యేది.

లక్ష్మిం— [ఠీవిగా]. నిజం నిజం! [లోపలికి వెళ్ళబోతాడు.]

నాగే— ఉండండి, మావఁగారూ, శ్రీహరిగారూ వారూ వస్తున్నారు. [తలుపుదగ్గిర కెళ్ళి] అమ్మా ! శ్రీ హరిగారు వస్తున్నారే, రా ! మావఁగారు క్షమాగ్పణ కోర్తారట ! ఏదో అయిపోయిన దానికి మళ్ళీలా అనుకోకమ్మా. చుట్టాల ముందు దెబ్బలాడుకోవటం బాగుండదు. (భార్యతో) ఒసేఁవ్, ఒకసారి బైటకి వెళ్ళి ఆవిణ్ని కూడా తీసుకురా.

[సరోజ వాళ్ళని ఆహ్వానించటానికని బైటకి వెడుతుంది. మరోనిముషంలో ఒకవైపునుంచి శ్రీహరి, ఆయనభార్య కమలమ్మగారు, సరోజ ఒకవైపునుంచీ, బాప నమ్మగారూ సీతారామయ్య ఒకవైపునుంచీ వచ్చారు.]

సరో— మామీద ఎంతోదయ ఉండబట్టి ఇలావచ్చారు. నాకందరికీ చాలాసంతోషంగా ఉంది. ఇవ్వాళ.

శ్రీహ— ఒకసారి వచ్చి చూసిపోతానని మీ ఆయనతో చెప్పానమ్మా అమ్మాయి. లేకపోతే మేము నూటిగా ఇంటికే పోవలసిందే. కలెక్టరుగారు వారింట్లో చాలాసేపుంచేశారు. పెందరాళే నిద్రపోవటం మాకు బాగా అలవాటు. అందుకని ఒక నిముషం తొంగిచూసి పోదామని—

బాప— (ఒక కుర్చీ ముందుకులాగి కమలమ్మగారితో) మీరు కూర్చోరూ?

నాగే— (శ్రీహరితో) మీరు రావటం కలెక్టరుగారికి చాలా సంతోషంగా ఉంటుంది.

శ్రీహ— ఏదో రహదారీ పునర్వర్గీకరణ విధానమని ఒక కొత్త స్కీము అమలులోకొచ్చేటట్టుంది. అందుకని.

నాగే— (పెల్లుబుకే ఉత్సాహంతో) నిజం!

బాప— అంటే ఏమిట్రా?

నాగే— రోడ్లని Reolassify చేయటంలే,

బాప— అదేదో మంచిపనే.

నాగే— అది అతిముఖ్యమైన విషయం. దానికి కావలసిన భోగట్టా యావత్తూ ఒక్క శ్రీహరిగారే ఇవ్వగలరు.

శ్రీహ— (పొంగిపోతూ) అది నాకొక్కడికే తెలుసని నాకు మహా గర్వం కూడా.

లక్ష్మీం— ఈ సమస్య నన్ను కూడా చాలా బాధ పెట్టిందనుకోండి. పన్నెండేళ్ళ క్రితం మాటలెండి. నేనేమని అచ్చేశానంటే.

శ్రీహ— నేను చెయ్యదలచుకొన్న.—

లక్ష్మీం— కాదు. పదమూడేళ్ళ క్రితం అనుకుంటాను.

బాప— (భర్తతో) శ్రీహరిగారు మాట్లాడుతున్నారు. శ్రద్ధగా వినండి, మాట మాటకి అడ్డంరాక.

సీతా— అలాగే వింటున్నాను, అడ్డం రావటంలేదు.

శ్రీహ— ఈవిషయం మీద కౌన్సిల్‌లో అతిముఖ్యమైన ఉపన్యాసం ఇవ్వాలను కుంటున్నాను. ఆ రిపోర్టంతా పేపర్లలో చూస్తారుగా!

నాగే— తప్పకుండా, చూడకుండా ఉండటానికి వీల్లేదు. ఏమే! వీలుందా?

శ్రీహ— అమ్మాయి. నా ఉపన్యాసం నీకు నచ్చుతుందనుకోను.

నాగే— అబ్బో మా ఆవిడ ఎప్పుడూ సీరియస్ సంగతులే చదువుతుందండి. ఆషా మాషీ అంటే తలనొప్పి ఆమెకి. ఎందుకు నిన్న నేదో చదువుతోంది. అదేం పుస్తకం చెప్మా? వావివరసలు. అలాంటి దానిమీద- ఎవడో తెలుగువాడే, రాశాడు, ఏమిటి వాడ్ పేరు?

సరో— ఏమయితే నేంలెండి.

నాగే— నా పెళ్లాం చాలా తమాషా రకం మనిషి; కదుటే? నీ కెప్పుడూ కోపం అనేదే రాదు; అవునా? [శ్రీహరితో] చాలా అందంగా వుంటుంది; కదండీ? మంచి పతిభక్తి వుంది! [భార్యతో] "పతిచరణారవిందముల పావన భావన మంచి భక్తితో"...చదువొనే ఆపద్యం!

బాప— నాగూ! అలాంటివారికి కాస్త కాఫీయేనా ఇవ్వద్దుట్రా.

నాగేం— అవును. అన్నట్టు [భార్యతో] యిదిగో చూడు!

[సరోజ లోపలికు వెళ్ళి ఫలహారాలు తెస్తుంది.]

నాగేం— [కమలమ్మతో] మా ఆవిడ వండర్‌ఫుల్ మేనేజరు లెండి. కొండమీది కోతిని తెమ్మన్నా, తీసుకొచ్చి పెడుతుంది. చూడండి, నిన్న కాక మొన్న ట్నుంచీ ఈఇంట్లో కొద్దామనుకొని యివాళే గృహప్రవేశం చేసుకొన్నామా! ఏది కావాలంటే అది అంతా రెడీ,

[నలుగురూ ఫలహారాలు చేస్తూవుంటారు; సుభద్ర వచ్చింది.]

లక్ష్మిం— ఇది మా రెండో అమ్మాయి, సుభద్ర.

శ్రీహరి— ఈవిడ భర్తగారు——

నాగే— ఆవిడకి వివాహంమీద ఇష్టంలేదు, ఆవిడ తన జీవితాన్నంతనీ కళకి అంకితం చేసేసింది.

కమ— ఓ, మీరు ఆర్టిస్టా? చాలా సంతోషమండీ. ఆర్టిస్టుల్ని నేను కళ్ళ కద్దుకొంటాను.

సుభ— నేను లేసులూ అవీ అల్లుతుంటానండీ అంతే.

నాగే— చాలా అందంగా అల్లుతారు లెండి.

శ్రీహరి— ఎగ్జిబిషన్‌లకి వాటికి పంపతూండండి.

నాగే— అద్భుతం, శ్రీహరిగారు అద్భుతంగా చెప్పారు. ఇంతకీ మీరెందుకు పంపించ లేదు వదినా?

సుభ— ఇవికాక మామూలు బొమ్మలు గీయటం, పూజాలు చేయటం——ఇలాంటి వన్నీ నాకు తెలుసు.

నాగే— మీ సంతోషంకోసం సరదాగా చేస్తారంతే. [శ్రీహరితో] మా వదినకి ఇలాంటివన్నీ చాలా సరదా లెండి. అన్నితే ఆమె శ్రమ అనుకోకుండా——

సుభ— నేను ఊరికే సరదాకోద్దీ చేయటంలేదు.

నాగే— సరదాకే చేస్తుంటారు.

లక్ష్మిం— కలాసాకి చేస్తుంటావు.

నాగే— ఒక ఆర్టిస్టు వున్నాడంటే, అతిస్వల్ప విషయాల్లోనే తన చాతుర్యమంతా చూపించేస్తాడు. ఎందుకు—పైడిరాజు చిత్రాలుగాని—గోఖలే చిత్రాలుగాని...

కమ— వాటికేం. ఊహకి కావలసినంత అవకాశం యిస్తాయి.

సుభ— దుకాణంవాళ్ళు పంపినవాటికి కాపీలుతీసి ఇస్తాను. అంతకంటే నాకు చేత కాదండీ.

బాప— రెండు జిలేబీలు వేసుకోవాలండీ కమలమ్మగారూ. మీరూరికే మొహమాట పడుతున్నట్టున్నారు.

కమ— ఎంతమాటన్నారు! నాకలాంటి భేషజాలేమీ లేవండీ. [సుభద్రతో] పాపు వాళ్ళేమిటమ్మాయి?

సుభ— ఏదో యింతపని కల్పించి, నాలుగురాళ్లు ముట్టచెపుతోంటారండీ.

కమ— ఓహో. [క్షణం నిశ్శబ్దం].

నాగే— (మెల్లగా) కాస్సేపు ఊరుకోండరూ వొదినా, మీకు పుణ్యముంటుంది.

సుభ— (తెల్లబోయి) నేనేమన్నాను?

నాగే— (కమలమ్మకి ఒక బొమ్మ చూపిస్తూ) మీకు బొమ్మలంటే బాగా ఇష్టమని నాకు తెలుసు. ఈబొమ్మ ఎలావుందో చెప్పండి? దీనికి చాలా డబ్బిచ్చాను.

[ఏవో కబుర్లు చెప్పుకుంటుంటారు.]

సుభ— (బాపనమ్మతో) అత్తయ్యా! నేనేమన్నా అనకూడని మాటన్నానా?

బాప— (కోపంగా) ఏమీలేదులే ఊరుకో బాబూ.

కమ— అర్థంకాని బొమ్మలంటే నాకు తలకాయనొప్పి. ఆ బొమ్మేమిటో చెప్పండి.

సరో— "సంధ్యకాలం" అని భగీరథి చిత్రం.

కమ— అతనిపేరు వినలేదు.

సరో— ఆయన చిత్రాలకు అంతర్జాతీయ ప్రదర్శనాల్లో బహుమానాలుకూడా వచ్చాయి. మన తెనుగు వాడే.

కమ— అలానా. నాకంటే ఈ విషయాలు మీకే బాగా తెలుసు. అన్నట్టు లక్ష్మింపతి గారి ఆడవాళ్ళ హక్కుల్ని గూర్చి నిన్న ఉపన్యాసానికి వెళ్లారా?

శ్రీహ— ఒహో, అవునవును. (నవ్వాడు)

కమ— (సరోజతో) అలాంటి అభిప్రాయాలంటే మీకు కొంత సానుభూతి ఉందను కుంటాను.

సరో— (తెలివిగా) నాకు తెలియదండీ.

నాగే— (నవ్వుతూ) ఎందుకు దాస్తావ్, ఒప్పేసుకో. కొంచెం అవుసాని

బాప— మగవారితో ఆడది సమమాతుందా!

సరో— (వినయంగా) ఎందుకు కాదు?
సీతా— కొందరాడాళ్ళకి దానివల్ల లాభించినట్లు కనపడదు.
సర— అందరికీ కాదు.
లక్ష్మిం— ఆడప్లీడర్లు!
కమ— ఆడడాక్టర్లు.
శ్రీహ— ఆడవాళ్ళ ఓట్లు.
నాగే— (నవ్వుతూ) వహ్వా!
లక్ష్మిం— ఆడవాళ్ళ ఓట్లు!
శ్రీహ— అదేమంచిదంటాను.
లక్ష్మిం— బలే బలే. ఆడకండక్టర్లు.
నాగే— ఆడ పోలీసులు!
లక్ష్మిం— ఆడసెనేటర్లు!
శ్రీహ— ఆడమంత్రులు!
లక్ష్మిం— ఆడ రాయబారులు!
శ్రీహ— (సరోజతో) ఎసంబ్లీలో పవిట్లు ఝాడించుకొంటూ కూర్చుంటారు.
కమ— ఎన్నికల్లో ఇంటింటికీ వెళ్లి ఓట్లు అడుగుతారు. అది ఈ కాలపు ఆడవాళ్ళకి చాలా సరదా.
శ్రీహ— ఆడవాళ్ళు ఎన్నుకున్న పార్లమెంటు ఎలా ఉంటుందో వారే చెప్పాలి. అందుకే సెంట్రల్ కూడా ఇలాగే ఏడుస్తోంది.
సరో— (నొచ్చుకొని) మీ మగవాళ్ళ సహవాసాన్నిబట్టి చూస్తే తప్పకుండా ఆడవాళ్లే నయమనిపిస్తోంది. మీకంటే ఆడవాళ్ళు కనిష్టంగా పాలిస్తారేమోనని భయపడక్కర్లేదు. [అందరి ముఖాల్లోనూ నవ్వుసిగ్గుపడి చల్లారిపోతుంది.]
నాగే— పాలించటం మాటెలావున్నా పాలివ్వటం మాత్రం ఆడవాళ్ళకి బాగా తెలుసు.
శ్రీహరి— ఈ రోజుల్లో ఎన్నికల తతంగం మీద ప్రతివాడికీ ఒక అసహ్యభావం ఉంది. నామటుకు నేను, ప్రజాప్రతినిధిగా, అలాంటి భావం ఎవరినోటినుంచి వినటానికి ఒప్పుకోలేను. [భయంకరమైన నిశ్శబ్దం].
సరో— [క్షమార్పణగా] మీ హృదయాన్ని గాయపరుస్తుందనుకో లేదండీ.
కమ— ఆసంగతి మాకు తెలుసునమ్మా.
శ్రీహరి— [భార్యతో] ఇంక పోదామేమరి.
నాగే— మా ఆవిడ నోటి దురుసుతనాన్ని మీరు క్షమించాలి.
శ్రీహరి— అబ్బే, ఎంతమాట!
నాగే— ఇలా మీరు వెళ్ళిపోవటం బాగోలేదు, ఇంకో కప్పు కాఫీ, తీసుకోండి.
కమ— ఏమీ వద్దండీ.

బాప— ఒక్క మిఠాయి ఉండవన్నా తీసుకోక తప్పదు.
కమ— పోనీ, ఇవ్వండి. మీమనస్సు కష్టపెట్టడ మెందుకు?
నాగే— కమలమ్మగారికి మిఠాయి ఇవ్వవే, సరూ. [కమలమ్మతో] అబ్బ. మహా దారుణంగా ఉన్నాయి ఎండలు! [సరోజతో] ఏదీ, మిఠాయి ఏదీ?
సరో— [ఖాళీ పళ్ళాలన్నీ చూసి ఖంగారుగా] అయిపోనాయి; తెప్పిస్తున్నా.
నాగే— నిజం!
కమ— పోనీ ఇబ్బంది పడకండి. తప్పు, అలా బాధపడకూడదు. వస్తానండి.
నాగే— సాగనంపి వస్తాను.
శ్రీహరి— ఏమీ అఖ్ఖర్లేదు మేం వెడతాం.

[అందరి దగ్గరా సెలవుతీసుకొని శ్రీహరి, కమలమ్మగారూ వెళ్ళారు; సరోజ దీపం పట్టుకొని, సాగనంపటానికి వెళ్ళింది. అంతా నిశ్శబ్దం. నాగేశ్వరావు కోపంగా గదంతా చిందులు తొక్కుతాడు. నరసమ్మ ముఖం చిట్లించుకొంటుంది.]

లక్ష్మిం— మనం పోయిపడుకోవటం మంచిది.
నర— పదేపదండి.

[వెళ్ళిపోతారు. సరోజ ప్రవేశించింది.]

నాగే— [చేతులు కట్టుకొని, తీవ్రంగా] అయితే ఇంక మిఠాయి లేదన్నమాట.
సరో— లేదండీ.
నాగే— నాకు ఒళ్ళుమండిపోతోంది.
సరో— నన్నేం చెయ్యమన్నారు! రెండు పంపులు తెప్పించమంటే, తెప్పించాను.
నాగే— నోర్మూయ్యి. వెధవవేషాలూ నువ్వూను. కమలమ్మగారిని ఇంకో మిఠాయి తినమని తీరా బలవంతం చేస్తే ఒక్కటీ కనబడదు! వెధవ మాడచ్చోద్యం.
సరో— అది నాతప్పు కాదు.
నాగే— అయితే నాతప్పంటావా?
బాప— ఇంక వేరే అనాలా?
నాగే— నేను రెండు పంపులే తెప్పించమన్నట్టు జ్ఞాపకం లేదు.
సరో— నేను చెప్తున్నానుగా.
నాగే— నాకదేమీ జ్ఞాపకంలేదు; కాని, నాలుగైదు పంపులు తెప్పించమన్నట్టుగుర్తు.
సరో— లేదు; రెండే తెమ్మన్నారు.
నాగే— నీకు తలబిరుసుతనం జాస్తిగావుంది; నలుగురిలోనూ నన్ను వెధవని చెయ్యాలని నీ ఉద్దేశం అంతేనా?
సుభ— అదేమిటోయ్; రెండు పంపులే తెమ్మని సరోజతో చెప్పినప్పుడు నేంక్కడే వున్నాను.

నాగే— నువ్వంటే నాకు గౌరవమే కాని, ఒక సంగతిమాత్రం నీకు ఖచ్చితంగా చెప్పాలి; మొగుడూ పెళ్ళాల కలహాల్లో ఇంకొకళ్ళు కలగజేసుకోవటం మంచిది కాదు. నీకా సంగతి తెలియకపోతే యిప్పుడేనా తెలుసుకో.

బాప— నువ్వెంత తక్కువ మాట్లాడితే ఊరికి అంత ఉపకార మౌతుంది. శుభం పలకరా మంకెన్నంటే, పెళ్ళికూతురుముండ ఎక్కడుందంటావ్.

సుభ— నేనేమన్నానత్తా ?

నాగే— కూలిపని చేసుకొని పొట్టపోషించుకుంటున్నానంటూ ఇంటికెక్కి అరవటం చాలకా ?

సుభ— అందులో అవమానమేమీ లేదు.

బాప— కావచ్చు. అయినా దాన్నిగురించి ఎవరూ నీలా వాగరు.

నాగే— వాళ్ళున్నంతసేపూ నాకు ఒకటేభయం; రెండు కూజాలు కొనుక్కోమని వాళ్ళవెంట పడతావేమోనని! ఇంకా నయం; బతికిపోయ్యాం.

సుభ— [ఏడుస్తూ] నాప్రారబ్ధం, నాఖర్మ, అన్నీ నా మొహాన్నే పడతాయి.

నాగే— [కోపంగా] ఓ, ఏడవకు తల్లీ, నీకు పుణ్యముంటుంది. నువ్వెంత ఏడ్చినా ఏమీ లాభంలేదు.

బాప— అయినా, ఏడవటాని కేమన్నావని ?

సరో— ఊరుకో అక్కా. [సుభద్రని తీసికెళ్లిపోతుంది.]

బాప— పోతానురా అబ్బాయి, పోయి పడుకుంటాం.

నాగే— ఇంతే నా అమ్మా !

బాప— మేమేం చేస్తాం నాయనా! కోరి తెచ్చుకొన్నావు. దారినపోయే శనిగ్రహామా, మా యింటికి రమ్మన్నావు. అనుభవించక తప్పుతుందా ? [వెళ్లిపోతారు.]

[నాగేశ్వరరావు నిశ్చలంగా నిలబడే ఉంటాడు. ఇంతలో సరోజ వచ్చింది.]

నాగే— నీతో ఒక విషయం చెప్పాలనుకుంటున్నాను.

సరో— నేను వింటున్నాను.

నాగే— ఈ ఇంట్లో ఒక్క క్షణం కూడా సుభద్ర ఉండటం నాకిష్టంలేదు.

సరో— ఎంచేత ? ఆవిడ చేసిన తప్పేమిటి ?

నాగే— నీకు తెలియదా ?

సరో— నాకు తెలియదు.

నాగే— మాటిమాటికీ నాపీకలమీదకి తెస్తోంది.

సరో— కాస్త అర్థంచెప్పండి.

నాగే— ప్రతిదానికీ నీకు అర్థాలు చెపుతూ కూచోవడం నాపని కాదు. నే నీ ఇంటికి యజమానిని, తెలుసా ? రేపు సోమవారంలోగా ఆవిణ్ణి పంపించెయ్యాల్సిన పూచీ నీది.

సరో— ఈ నెలాఖరుదాకా ఆవిడ ఇక్కడే ఉండాలి. ఎందుకు ఉత్తరాలో చెప్పమం టుంది. ఏమని చెప్పను?

నాగే— నీ ఇష్టంవచ్చింది చెప్పు

సరో— ఆవిడ బాధపడుతుంది.

నాగే— నేను బాధపడను.

సరో— కాని, నేను బాధపడతాను.

నాగే— నువ్వు చెప్పలేకపోతే నేనే చెప్పేస్తాను. నేను జాగ్రత్తగా చెప్పగలను.

సరో— ఆవిడకి కోపం వస్తుంది.

నాగే— ఆవిడ పెట్టుపోతలేం చాలటంలేదు. రానీ, వస్తే?

సరో— మీరిద్దరూ దెబ్బలాడుకొంటే, నేను ఆవిణ్ణి చూడాలంటే ఎలాగ? ఇక్కడ చూడొచ్చా?

నాగే— వీల్లేదు నేను ఒఖనాటికి ఒప్పుకోను.

సరో— నన్నలా శాసించటానికి మీ కధికారం ఉందా?

నాగే— ఉంది.

సరో— ఎలాగ?

నాగే— నేనీ ఇంటికి యజమానినని మళ్ళీ చెప్తున్నాను. ఎప్పుడూ భర్తే తన ఇంటికి యజమాని. ఆడపెత్తనం నేను ఒప్పుకోను.

సరో— సరే.

నాగే— నీకిష్టంలేకపోయినా సరేనోరుమూసుకొని నేను చెప్పినట్టు నడుచుకోవలసిందే.

సరో— నాకిష్టం ఉన్నా లేకపోయినానా?

నాగే— నీ యిష్టం ఎవడిక్కావాలి? నేను చెప్పినట్లు చేయటం, నాభవిష్యత్తుకు అడ్డురాకుండా ఉండటమే నీపని. శ్రీహరిలాంటి వాళ్ళు ఎంతో ముఖ్యులు. వాళ్ల ఉపకారాలు నాకెన్నో ఉంటాయి. నీ తెలివి తక్కువతో వాళ్ళ మనస్సులు గాయపరచావనుకో; నీ విద్యుక్తధర్మాన్ని నువ్వు మరచిపోయా వన్నమాట. వివాహమంటే వ్యాపారంలో భాగస్వామ్యం లాంటిది.

సరో— ఓహో, అలానా? అయితే ఎక్కౌంట్లన్నీ నాకుచూపించండి. మీవ్యాపారం దివాలా తీస్తోందని అంతా అంటున్నారు.

నాగే— ఆడవాళ్లకలాంటి గొడవలేమీ తెలియవ్. నువ్వు ఇంటిసంగతులు చూసు కొని తతిమ్మా గొడవలన్నీ నాకు వొదిలెయ్. ఆడదానికెన్నేళ్లొచ్చినా భర్తే ఆమెకి గార్డియన్. నీ వ్యవహారాలన్నీ నాశక్తికొద్దీ పరిష్కారిస్తాను. అదే నేను చెప్పాలనుకుంటున్నాను.

సరో— ఓహో, ఇంకోలా చెప్పాలంటే, కళ్లూ నోరూ మూసుకొని మీ రాడించదల అటగా సమర్థించే భాగస్వామి నన్నమాట. అవునా?

నాగే— మళ్లీ ఆడవాళ్ల హక్కులమీద ఉపన్యాసాలలోకి దిగటం నాకిష్టంలేదు, నిన్న సాయంత్రం మీటింగులో విన్నానులే. అలాంటి విషయాలన్నీ గెడ్డాలున్న ముసలమ్మలకి వదిలేద్దాం. నువ్వు చెప్పేది కొంచెం ఊరుకొంటేనా ఈ ప్రభుత్వ చట్టాలన్నీ ఆడదాన్ని బానిసగా ఎలా తయారుచేశాయో ఒక జాబితా తయారు చేసి పెడతావ్. ఇంకా నయం అర్ధ్ధయాత్రలుకూడ చేయిస్తాననలేదు. నాకు తెలుసు.

సరో— ఇదేమీ చట్టాల గురించి మాట్లాడటం కాదు. చట్టాలప్రకారం పోలీసుఆ ప్రవర్తిస్తే ఈరాజ్యాంగం యాపత్తూ స్తంభించి పోకపోదు. తప్పల్లాలే చట్టాల్ని సమాజం వాడుకోవటంలోనే ఉంది. (క్షణంనిశ్శబ్దం) కోడ్ లో ఇలాంటి అవకాశం ఉందనికాదు, మన తలిదండ్రులు మనకి పెళ్ళిచేయాలి కనుక చెయ్యటమే జరిగిన ఘోరమల్లా.

నాగే— అందరూ ఏం చేస్తారో వాళ్ళూ అంతే చేశారు.

సరో— అందుకే పెళ్ళిళ్ళన్నీ అలా ఏడుస్తున్నాయి.

నాగే— నువ్వే నన్ను ప్రేమించి ఉన్నట్టయితే—

సరో— కాని నేను నిన్ను ప్రేమించను. అదే ఉన్నరహస్యమల్లా. అలాగే నువ్వు నన్ను ప్రేమించవ్. అయినా తెలని గొలుసులో లంకెల్లా పడున్నాము.

నాగే— అదేంమాట; నేను నిన్ను ప్రేమించటంలేదూ?

సరో— లేదు నాకు తెలుసును. నువ్వు ప్రేమించటం లేదని.

నాగే— ఛ ఛ. పిచ్చి పిచ్చిగా మాట్లాడకు. అప్పుడే పొద్దుపోయింది. పోయి పడుకుందాంగా. రేపుపొద్దునకి అన్నీ చక్కబడతాయి. (పడకగదిలోకి వెళ్ళి పోతాడు.)

సరో— (అలాగే కూర్చుని శూన్యంలోకి దీనంగా చూస్తుంది. ఒక నిముషం పోయాక తనలో తానే) ఏవీ ఎప్పుడూ చక్కబడవ్. ఎప్పుడూ చక్కబడవ్. నాకు తెలుసు ఎప్పుడూ చక్కబడవ్.

నాగే— (పిలుస్తూ) వస్తున్నావా సరూ? (సరోజ త్ర్ళుళ్ళిపడింది. కంగారుగా చుట్టూ చూసింది.) రావాలి.

సరో— (దీర్ఘంగా నిట్టూర్చింది. ఆవిడ ముఖంలో విసుగు విషాదమూ స్పష్టంగా కనిపిస్తాయి.) వస్తున్నాను. (మెల్లగా పడకగదివైపు అడుగులు వేస్తుంది.)

తెర

# అంకం 3

[దృశ్యం మొదటి అంకంలోవలె ఉంటుంది. సెప్టెంబర్ నెల. లక్ష్మీంపతి, ఆయనభార్య కూచున్నారు. లక్ష్మీంపతిముందు ఎక్కౌంటు పుస్తకాల బొత్తిఉంది.]

లక్ష్మీం— చూశావ్వా, ఎక్కౌంట్లు ఎలా ఉన్నాయో! అద్భుతంగా ఉన్నాయి. సుభద్ర నొకసారి ఇలా తీసుకురా.

నరసమ్మ— నిఘంటికంటే ఈ ఏడాది మరీ ఘోరంగా ఉన్నాయి.

లక్ష్మీం— చెప్పకేంటే సిగ్గుచేటు. నూటపన్నెండు రూపాయల పధ్నాలు గణాలం లాభమా ఏమి ఎక్కౌంట్లురా నాయనా!

నర— మరి ఏం చెయ్యాలంటారు?

లక్ష్మీం— అదే తెలియటం లేదు. ఒకటి మాత్రం నిజం. ఇలాగే అయితే కొద్ది గాజుల్లో ఉన్న కొంపాగోడీ కూడా అమ్ముకు తినాలి.

నర— అయితే ఏం చేద్దామంటారు?

లక్ష్మీం— "సిరితాపోయిన పోవును కరిమింగిన వెలగ పండుకైనని సుమతీ!" అని ఒకలా చెయ్యక పోతే పై సంవత్సరం మన బ్రతుకంతే.

నర— ఎలా చెయ్యక పోతే?

లక్ష్మీం— ఈ మసిలమ్మ క్రెడిల్ అమ్మేసి జపాన్ మెషిన్ ఏదన్నా తెప్పించాలి. మానాన్నగారి కాలంనుంచి అరిగి పడున్నాయి ఆ సైపులు. అమ్మేసి, ఏ అర్మిగమో, ఏ నెల్సనో సైపులు తెప్పించాలి. మోటారు ఒకటి బిగించాలి. అప్పుడేమన్నా కొంత ఆశఉంటుంది. ఇంతకీ ఒకటి కావాలికదా!

నర— ఏమిటది?

లక్ష్మీం— డబ్బు, డబ్బు, డబ్బు.

నర— ఆదెల్లాగునో దేవుడా!

లక్ష్మీం— వినవోయ్ నాయుడూ ముందు: నీ మొగుడు వతి తెలితక్కువ దద్దమ్మ కాక పోవటం నీ అదృష్టమే ననుకో. ఈ చిత్తులొంచి ఎలాగో పైటపడాలని చూస్తున్నాను. [సుభద్రవచ్చింది.] వెళ్ళి సరోజను లాక్కురా. నువ్వూ సరోజ పదినిమిషాల్లోరండి నేను పిలుస్తాగా.

[నరసమ్మ వెళ్ళి పోయింది.]

అమ్మాయి, నీతో చాలాముఖ్యమైన విషయాలు మాట్లాడదామనుకుంటున్నాను. నేను చిలక్కి చెప్పినట్లు చెప్పాకకూడా, నా మాట కాదనకుండా, మీ పెద్దమ్మ ఆనంతరం వచ్చిన ఆస్తిని అనుభవించడానికే ఒప్పుకున్నావ్. అవునా. అన్నట్టు [illegible] సత్యవతి వస్తోంది.

సుభ— ఇక్కడికి కొస్తోందా ?

లక్ష్మిం— అది వేరే విషయం. సరోజ, మీ అమ్మ వచ్చాక ఆవిషయం ఆలోచిద్దాం. ప్రస్తుతం నేను నీ సంగతే మాట్లాడుతున్నాను. ఇప్పటికి అన్ని ఇబ్బందులూ పోయినట్టే—అన్నట్టు ఈమధ్య చాలా అవస్థలు పడ్డానులే—రేపు నాలుగు గంటలకి బుధవరపు కామరాజుగారింటి దగ్గర—మన ప్లీడరే, ఎరగవ్ ?—రెండు వేల తొమ్మిది వందల తొంభైతొమ్మిది రూపాయల పదమూడణాల మొత్తాన్ని అందుకుంటావ్. తెలిసిందీ ? అమ్మలూ, నీకు యుక్తవయస్సు వచ్చింది; నువ్వు బుద్ధిమంతురాలివీ, లోకజ్ఞానం వున్నదానివీ. కాస్త వయస్సు రాగానే ఒళ్ళూ పై తెలియకుండా తమ ఇష్టంవచ్చినట్టు వ్యవహరించే యీ కాలం కుర్రాళ్ళరకం కాదునీవు. తల్లిదండ్రులమీద నీకున్న ప్రేమ, అనురాగం—ఎలాంటిదో నాకు తెలుసు. నీకు సలహా చెప్పదగ్గ హక్కు నాకుందని నువ్వు ఎప్పటికీ ఒప్పుకుంటూనే వుంటావ్. వయస్సులో నీకంటె పెద్దవాణ్ని. కాటికి కాళ్లు జాపుకు కూర్చున్నాను. పెద్దది అలా అయిపోయిందా ? చిన్నది అత్తారింట్లో పడిందా? ఇంక ఎటొచ్చీ కొడుకువైనా, కూతురువైనా నువ్వే. చూడు, వ్యాపారంలో నాకు కొంత అనుభవం వుంది. నువ్వు నీ డబ్బు పెట్టుబడి పెట్టాలనుకుంటేమాత్రం నేను నా సర్వవిధాలా నీకు వుపయోగపడతాను. అలాంటి ఆలోచన లేదేంవిమ్మా వస్తున్నయ్యా ?

సుభ— నేను—

లక్ష్మిం— చెప్పమ్మా. ఏమనుకున్నావో చెప్పు.

సుభ— చెప్పక పోవటమే మంచిది.

లక్ష్మిం— ఏం ?

సుభ— ఏమో !

లక్ష్మిం— ఓహో, అలానా. [కోపంతో]

సుభ— మరోలా అనుకోకేం నాన్నా.

లక్ష్మిం— [ఆరికాలిమంట నెత్తికెక్కుతున్నా నిగ్రహించుకొంటూ] అబ్బే, ఫరవా లేదు. అయితే చెప్పవలసిందేమీ లేదన్నమాట. కొంచెం ఆశ్చర్యపడుతున్నానంతే; నామనస్సు కొంచెం గాయపడింది; కొంచెమేమిటి బాగానే గాయపడింది.

సుభ— నా సంగతి మీకు తెలుసుకదా నాన్నా.

లక్ష్మిం— నీ నాన్నమీద నీకు నమ్మకం లేదని నాకు బాగా తెలుసు. ఆ సంగతే మళ్ళీ ఇంకోసారి రుజువయింది. నీ ఇష్టం వచ్చినట్టు ఉండు. నేనేమీ అడగ దలచ లేదు.

సుభ— నాన్నా, నామీద కోపం వచ్చిందా ?

లక్ష్మిం— మధ్య నీమీదెందుకు కోపం నాకు? ఈ కాస్త ఆస్తి ఏ దేవాలయానికో అప్పగించావంటే నేను హాకీమన్నాక ఏమంటాననిగాని; నాకు తెలుసులే ఏ దేవాలయానికో అప్పగిస్తావని. [సుభద్ర ఊరుకుంది.] అవునా?

సుభ— కాదు నాన్నా ఇప్పుడు నేనేమీ చెప్ప దలచుకోలేదు.

లక్ష్మిం— ఇంచుమించు అంతేనన్నమాట.

సుభ— నాన్నా, ఊరుకోండురూ.

లక్ష్మిం— నీ ఉద్దేశమేమిటో చెప్పవన్నమాట.

సుభ— ఊహు..

లక్ష్మిం— అయితే చెప్పవన్నమాటేగా.

సుభ— ఆ మాత్రం హక్కు లేదా నాకు?

లక్ష్మిం— ఎందుకులేదు. నువ్వేమీ చంటిబిడ్డవి కాదు; నాలుగుతన్ని కూర్చోబెట్టడానికి.

సుభ— మళ్ళీ ఈ ప్రసంగంతే కండి.

లక్ష్మిం— అలాగేలే. నీ ప్రారబ్ధం; నేనేం చేస్తాను? [ఒక్క నిముషం ఆగి, కోపాన్ని పట్టలేక] ఇదన్నమాట నాకు ప్రతి ఫలం! నా కూతుళ్ళకి నా జీవితమంతా ధార పోసి ందుకు ఫలం ఇదేనా? పని మనిషిని నమ్మిన పాటన్నా నువ్వు నమ్మ లేవా నన్ను?

సుభ— ఆదేమిటి నాన్నా. మీ రంటే నమ్మకమే నాన్నా.

లక్ష్మిం— నోర్మూయ్యి. నీకు గుండెల్లేవు. భయమూ భక్తీ ఎక్కడన్నా చస్తేనా! ఇంత నీచురాలి వనుకోలేదు.

సుభ— కోప్పడకండి నాన్నా.

లక్ష్మిం— కోపమా? అవును కోపమే. నా కోపానికి కారణం కూడా ఉంది. [బల్ల గుద్ది] వెధవవేషాలు! ఇంత అవమానమా! అరవై రెండేళ్ళు బతికి ఇలా అవ మానం పాలవటమా. [గదిలో పచారీ చేస్తాడు.]

సుభ— నేనప్పుడే కొంత డబ్బు ఖర్చుపెట్టేస్తానను కున్నాను.

లక్ష్మిం— [ఆగి] ఏమిటి?

సుభ— ఒళ్ళకిస్తానని మాట ఇచ్చాను.

లక్ష్మిం— [తెల్లబోయి, దగ్గిరకొచ్చి, మందలిస్తూ] అమ్మాయి, ఆ సంగతి నే నడిగి నప్పుడే ఎందుకు చెప్పలేదు?

సుభ— నన్ను చెప్పనిస్తేగా?

లక్ష్మిం— ఎంతేమిటి?

సుభ— ఆరు వందలు.

లక్ష్మిం— అమ్మయ్యో, మిగతాది?

సుభ— మీ సలహా ప్రకారం చేస్తామని.

లక్ష్మిం— నేననుకుంటూనే వున్నాను. పెట్టుబడి పెట్టడానికి సాధనాలేమున్నాయో ఆలోచిద్దాం. నేషనల్ సేవింగ్స్ సర్టిఫికెట్స్ కొంటే వడ్డీ చాల తక్కువ. బ్యాంకులో పడేస్తే నూటికి రెండున్నర వడ్డీ ఇస్తారు. అంతకంటే ఎక్కువ వడ్డీకి అప్పులిద్దామా అంటే ఋణవిమోచన చట్టాలు, లైసెన్సులూ—వాళ్ళ శ్రాద్ధం ఎన్నో. ఇక పెద్దకంపెనీల్లో వాటాలున్నాయి; వాటితో ఎన్ని చిక్కులు! ఒకమూల అమెరికావాడి పోటీ. మరీ దారుణంగా వుంది. కార్మికులకీ పెట్టుబడిదార్లకీ మధ్య తగాయిదాలు మరీ ఘోరంగా తయారౌతున్నాయి.

సుభ— ఇందాక నాగేంద్ర—

లక్ష్మిం— వచ్చాడూ! నాకు తెలుసు : వట్టి వెధవ వాడు. వాడి వ్యాపారానికి పెట్టుబడి పెట్టమన్నట్టున్నాడు! అవునా ?

సుభ—అవును.

లక్ష్మి— చూశావూ ? ఆమాత్రం నేనూ గ్రహించగలను. పోరా సైతాన్ అన్నావా ?

సుభ— ఇంకా ఆలోచించాలన్నాను.

లక్ష్మిం— బాగా అన్నావు. 'అలాగే' అన్నావేమోనని భయపడిపోయాను. ఆఁ, ఏదో చెబుతున్నాను : బ్యాంకులా అలా ఏడుస్తున్నాయి. ఇంకేమిటి మిగిలింది ?

సుభ— నాకు తెలియదండీ.

లక్ష్మిం— ఇంకా వ్యాపార సాళి ఒకటుంది. ఈ చచ్చు నాగేంద్రంగాడు కాక ఇంకెవడన్నా వ్యాపారం చేస్తూన్న పెద్దమనిషి వున్నాడా ?

సుభ— నాకు తెలియదండీ.

లక్ష్మిం— మన బుర్రలు రెండూ కలిపి ఆలోచిద్దాం కాస్త నమ్మకస్తుడు దొరకాలి. అన్నట్టు కామేశ్వరమ్మతో కలసి—

సుభ— వద్దు నాన్నా. ఆవిడ మొగుణ్ని వదిలివేసింది. ఏదో బొమ్మవేసి ఇమ్మంటే ఇవ్వనన్నానుకూడా.

లక్ష్మిం— అవునులే. అన్నట్టు సుబ్బనాయుడో !

సుభ— అతను నాయుడు కదండీ.

లక్ష్మిం— అవునవును. అయితే ఇంకెవరూ లేరు.

సుభ— మీరో నాన్నా. మీరు చేస్తే బాగుంటుంది నాన్నా.

లక్ష్మిం— ఏమిటేవ్ ? నేనే ?

సుభ— అవును.

లక్ష్మిం— అమ్మయ్యో, చాలా పెద్ద బాధ్యతకదా తల్లి. నేనేం చెయ్యగలనా అని—
ఆఁ, అయితే ఏ మాత్రం వడ్డీ ఇమ్మంటావ్ ?

సుభ— మీకు తోచినంత ఇద్దురుగాని లెండి.

లక్ష్మిం— సరే, మీ అమ్మతో ఆలోచించి చెప్తాను. [అప్పటికప్పుడే నిశ్చయించినట్టు] ఎందుకూ; అనవసరం. అలాగే నమ్మా. నా కన్నబిడ్డకి ఉపకారం చేయటానికి సందేహించాననే అపకీర్తి ఎందుకు రావాలి ?

సుభ— అలాగే నాన్నగారూ.

లక్ష్మిం— చూశావూ; మిగతా ఆరువందలతో ఏం చేయనున్నావో చెప్పావ్ కాదు.

సుభ— నన్ను అడగకండి నాన్నా.

లక్ష్మిం— సరేలే. నీ సొమ్ము నీ ఇష్టం వచ్చినట్టు చేసుకుంటావ్; నాకెందుకు అవసరమైన కాయితాలన్నీ రాయించి ఉంచుతాను. అతాపత్రయమేమీ నీకక్కర్లేదు. ఊరికే సంతకం చెయ్యటమే నీపని. [గడియారం చూసి] అప్పుడే మూడై పోయింది. ఇంకో విషయం తేల్చుకోవాలింక...ఏమేఁ, లోపలికిరండి. [సరోజ, నరసమ్మ వచ్చారు] కూర్చోండి. ఇంక ఒక మహత్తరమైన, అతి ముఖ్యమైన విషయాన్ని సంప్రదించటానికని మిమ్మల్నందర్నీ ఇక్కడికోసారి రమ్మన్నాను. అది చాలా కఠినమైన సమస్య. మన సత్యవతి సంగతి. కాకినాడలో అది ఎలాబతికిందో మీకందరికీ తెలుసు. చెప్పుకుంటే సిగ్గుచేటు కూడాను. దాన్ని ఇక్కడకి తీసుకురావటం మంచిదంటారా ? లేక స్టేషన్కి కూడా వెళ్ళటం మంచిదంటారా ?

సరోజ— నాన్నా, సత్యవతి ఏం చేసింది నాన్నా ? నాకు పెళ్ళయి పోయిందిగ కనుక ఫరవాలేదు చెప్పునాన్నా. నేనురాగానే అందరూ ఆమె ప్రసంగమే మానుకుంటారు. నాకు సత్యవతి బాగానే జ్ఞాపకం ఉంది.

నర— అప్పట్లో నీకింకా బాగా చిన్నతనం.

లక్ష్మిం— ఈ విషయం మనకందరికీ ఎంతో తలవంపులు తెచ్చింది. అందుకని మీరూ, నేనూ ఎంత బాధపడుతున్నామో చూడండి. నా నోటితో నేనా వివరాలన్నీ చెప్పలేను. నాకు నోరురాదుకూడా. కాని ఒక్కసంగతి చెప్తావిను సరోజా. సత్యవతి తన పదహారోఏట ఇంట్లోంచి వెళ్ళిపోయింది. ఎందుకంటే—ఎందుకంటే—

నర— నెల తప్పిందని.

సరో— లేచిపోయిందా ?

లక్ష్మిం— అవును.

సరో—తనంత తనే ?

లక్ష్మిం— నేనే పంపించేశాను.

సరో— ఆఁ !

లక్ష్మిం— నేను చెప్పానుగదా. ఈ విషయం చాల బాధగా వుంటుందని. అందుకని ఎంత తొందరగా ఆ గొడవ వదులుకుంటే అంత మంచిది. ఆవిడ యివాళ ఇక్కడికొస్తోంది. [గడియారంకేసి చూచి] ఈపాటికి వచ్చేస్తూ వుంటుంది. అప్పుడే రైలువచ్చి ఐదునిమిషాలు దాటింది. ఇంకమీరంతా చాలా హుందాగా మసులుతారని భావిస్తా. ప్రేమతో కౌగలించుకోవట మనేది ఇంక ఎలాగూ అసాధ్యమే. అని ముూతి ముడుచుకొని కూర్చో అఖ్ఖర్లేదు; అది నిర్దయగా వుంటుంది.

సరో— ఆవిడ ఇల్లువిడిచి పోయినప్పట్నుంచీ ఆవిడ సంగతు లేమన్నా విన్నారా నాన్నా ?

లక్ష్మిం— వినకేఁ, విన్నాను.

సరో— ఆవిడ ప్రవర్తనను గురించో ?

లక్ష్మిం— వంశ మర్యాదల్ని గంగలోకలిపి వుంటుందనుకుంటాను.

సుభ— మీరు చాలా తేలిగ్గా మాట్లాడేస్తున్నారు నాన్నా. ఆమెను గురించి ఎన్నో సార్లు విన్నాం. ఆవిడ పాపాయి పోయినప్పుడొకసారి. నాటకాల్లో వేషాలు వేస్తోందనీ, చిల్లిగవ్వ చేతులో లేకుండా మాడిపోతోందనీ ఇంకొకసారి. మూడోసారి బోలెడు ఆస్థి సంపాదించిందనీ, గాంధీనగరంలో మేడ కట్టిందనీ విన్నాం. ఆ డబ్బంతా సునాయాసంగా సంపాదించిందని విన్నాక బొత్తిగా అదంటే అసహ్యం పుట్టింది నాకు. అందుకనే కలకత్తా పెద్దమ్మ ఆస్థికి సంతకం చెయ్యనన్నాను.

సరో— నువ్వు సంతకం పెట్టకపోతే ఆవిడ వారసత్వం చెల్లదు. నీకు ఆవిడంటే అసహ్యం ఐతే కావచ్చుగాని ఆవిడ డబ్బు చెడగొట్టటం మాత్రం మంచిపని కాదు.

సుభ— అందుకనే ఒప్పుకొన్నాను. ప్లీడర్ దగ్గరికి వస్తానన్నానుగా. ఆవిడ ఇక్కడి కెందుకు ?

లక్ష్మిం— నేను ఆమెని చూడాలి. సరోజ ఆమెని చూడాలి. మీ అమ్మకూడా అంతే.

సర— దానికి నువ్వంటే ప్రాణం సుభద్రా. నీకూ అంతేగదా. అంత క్రూరత్వం కూడదు, జేనికైనా. దానిలాంటి బ్రతికిచెడ్డ వాళ్ళంటే కొంత దయాంతఃకరణకూడా ఉండాలి

సుభ— [ఆగి] సరే. మీ ఇష్టమొచ్చినట్టే చేస్తాను.

లక్ష్మిం— అలా అన్నావ్ బాగుంది. కాని ఒక అంతునుంచి ఇంకో అంతుకు వెళ్ళటం [illegible]లేదు. ఇక్కడ ఉండమనిగాని, ఇక్కడ భోజనం చెయ్యమనిగాని [illegible] చెయ్యటానికి ఎవరూ పూనుకోవద్దు, సరేనా ?

సుభ— అలాగేలెండి. నేను మళ్ళీ వస్తాను. [వెళ్ళి పోతుంది.]

లక్ష్మిం— సరూ, నువ్వుకూడా నీ పని చూసుకో. [సరోజ వెళ్ళిపోయింది.] ఇంకో పది నిముషాల్లో సత్యవతి వచ్చేస్తుంది.

సర— అదే నా సొంతకూతురైతేనా ఈవాళ పొద్దుట్నుంచీ స్టేషన్‌లో పడిగాపులు పడి ఉండేదాన్ని.

లక్ష్మిం— నాకు మాత్రం ఆ బాధలేదను కుంటున్నావా ?

సర— అయితే ఎందుకు వెళ్ళలేదు ?

లక్ష్మిం— లోకం ఏమనుకుంటుందో తెలుసా ? ఈ ఊళ్ళో ప్రతిగాడిదకీ నన్ను తెలుసు. ప్లాటుఫాం మీద నిలబడితే వందమంది వంద ప్రశ్నలేస్తారు. ఆ మాటలు విడిచిపెట్టు. ఇక్కడ కలుసుకోవటమే దర్జాగా ఉంటుందను కున్నాను. [ఆలోచించి] వారం రోజులబట్టి ఆలోచిస్తున్నాను—తీరా అదొచ్చాక ఏమని పలకరించనా అని,

సర— దగ్గిరికి తీసుకొని, తల నిమురండి; తరువాత కథ సాగిపోతుంది.

లక్ష్మిం— నేను బుజ్జగించాలంటావ్ ?

సర— అవును.

లక్ష్మిం— నువ్వు చెప్పింది బాగానే ఉంది కాని, దాని పద్ధతీ, వ్యవహారం ఎలా సహించటమా అని, అదే చాలా పెద్ద సమస్య దానితో ఏమి చెప్పాలి ? గతాన్నంతా తవ్వి పొయ్యాలా ? దాన్ని క్షమించినట్టు మాత్రం నేను కనిపించకూడదనుకో. అది ఏ కోశానా కనబడకూడదు. తీరా వస్తోందనుకునే పిచ్చిగా నేను—రట్, చప్పబడి పోకూడదు.

సర— నేనేం చెప్పను ?

లక్ష్మిం— [ఇంకా ఆలోచిస్తూనే] ఎంత కాదన్నా అది నా గర్భవాసం. అందుకోసం దాన్ని చూసి ఏదైనిమిదేళ్ళు అవుతుందనుకుంటాను. దానిముఖం మళ్ళీ చూడకూడ దనుకున్నాను. అది వెళ్ళిపోయిన రోజుల్లో దానికోసం ఎంత బాధ పడ్డానూ అది మరిచిపో గలిగానంటావా ?—ఏమో ఏమైనా, నువ్వే సలహా చెప్పాలి. ఆ క్షణాని కెలావస్తే అలా మాట్లాడకుండా వుండటానికి ని ముందుగానే ఎలా మాట్లాడాలో సిద్ధంచేసుకొన్నాను. సిద్ధంచేసుకొన్నా నన్నాను కదూ ? అదంతా రాసుకుని కంఠతాపట్టాను. ఈ గొడవతో సాబుగ్ర పని చేయకుండా పోయింది. “అమ్మాయి”—“అమ్మాయి” అనటమే బాగుంటుంది. “అమ్మలూ” అనటం ఎక్కువ చనువిచ్చినట్టు. “సత్యవతీ” అనటం బాగోలేదు. “అమ్మాయీ”—ఒచ్చిన ప్రమాద మేమిటంటే ఇంతకీ అదేమని సమాధానం చెబుతుందో నాకు తెలియటంలేదు. ఉత్తరాలుమాత్రం చాలా జాగ్రత్తగా వ్రాసింది. ఇంతకీ మనల్ని చూడగానే రాగం పెడుతుందంటావా?

సామ్మసిలి పడిపోతే? ఓరి దేముడా—ఏం చెయ్యాలో తెలియటంలేదు. ఒక్క అరగంట గడిచిపోతే బాగుండిపోను. ఇంతకీ సుభద్రతో సంగతులేమీ విడమర్చి చెప్పలేదు. అదే మంచిదనుకుంటాను.

నర— అదేం?

లక్ష్మిం— చెప్తావిను. సత్యవతి సంతకం పెట్టందే సుభద్రకి ఆస్థిరాదు. ఈసారి తెలిసిందా? సుభద్ర సంతకం పెట్టకపోతే సత్యవతికి పోయిందేమీ లేదు.

నర— మీరు ఇంకోలా అన్నారు కదండీ?

లక్ష్మిం— అవును; కథ కొంచెం అడ్డంగా తిప్పాను. సత్యవతికి తన సంతకం లేనిదే ఆస్థి దక్కదని చెప్పానుకనక గానీ లేకపోతే సుభద్ర సత్యవతిని చూడటానికే ఒప్పుకోదు. విల్లు ప్రకారం సత్యవతే ఎగ్జిక్యూటర్. నిజానికి సత్యవతే మనకి కొంత వుపకారం చేస్తోంది. ఆ గొడవలన్నింట్లోకి దిగామా ఇంక తెమలం కనుక ఆపేస్తాను, అందుకని సత్యవతితో "అమ్మాయి, నువ్వు రావటం నాకు చాలా సంతోషంగా వుంది; గతాన్ని మరిచిపోవటం మంచిది. నీ చెల్లెలికి వుపకారం చెయ్యాలనే సద్బుద్ధితో నువ్వు రావటం మాకెంతో ఆనందంగా ఉంది." ఇలా అంటే బాగుంటుం దంటావా? [ఆగి] అదిగో బండి చప్పుడు. ఆ సుబ్రహ్మణ్యం పిసుగ ఎక్కౌంటు పుస్తకాలింకా తీసెయ్యలేదు చూడు. ఒసేవ్, ముందు ఈ గదిలోకి పోదాంపద. అలా మాట్లాడితే చాలంటావా? [వెళ్ళిపోతారు.]

[రాముడు, వెనకనే సత్యవతి లోపలి కొచ్చారు. సత్యవతి అప్సరసలా వుంటుంది.]

రాముడు— లోపల ఉన్నట్టున్నారమ్మగారు. ఎవరొచ్చారని చెప్పనండి?

సత్యవతి— గరిమెళ్ళ సత్యవతి వచ్చిందని చెప్పు.

రాము— మా అయ్యగార ఇంటి పేరేనే మీదీనూ?

సత్య— అవును.

రాము— ఉప్పుడే పిల్చుకొస్తా నుండండి, [వెడతాడు].

సత్య— ఏవీ ఇది వరకులా లేదు. అంతా మారిపోయింది.

[సుబ్రహ్మణ్యం వచ్చాడు]

సుబ్ర— లక్ష్మింపతిగారు ఒక్క నిముషంలో వస్తానుండ మన్నారు.

సత్య— అలాగేనండి. [సుబ్రహ్మణ్యం ఎక్కౌంటు పుస్తకాలు తీస్తూ కంటికొసనుంచి సత్యవతికేసి చూస్తాడు.] మీ పేరు సుబ్రహ్మణ్యంగారు కదూ?

సుబ్ర— [తొట్రుపడి అవునండి సత్యవతిగారూ. నేను జ్ఞాపకం ఉన్నానా? ఈ మధ్య నా వొంట్లో బావుండటం లేదు. ఏవో ఇబ్బందులు. అది వేరేకథ అనుకోండి.

[పుస్తకాలు చంకక్రింద పెట్టుకొని ఆవిడముందే నిలబడతాడు] మిమ్మల్ని చూడగానే గుర్తుపట్టాను; లక్ష్మింపతిగారు చెప్పారుకూడా.

సత్య— ఆయనకి ఆరోగ్యంగా ఉంటోందా ?

సుబ్ర— [కంగారుపడి] ఆ. అంతా క్షేమంగానే ఉన్నారు. అంతా నిక్షేపంలా ఉన్నారు. మీరుకూడా ఆరోగ్యంగానే ఉన్నారు.

సత్య— ఏదో మీదయవల్ల.

సుబ్ర— నారసత్యం నోడవలకని వచ్చినట్టున్నారు.

సత్య— అవును. [నిశ్శబ్దం]

సుబ్ర— ఇక్కడ చాలా మార్పుకనిపిస్తోంది కదండీ.

సత్య— అబ్బో, చాలా మార్పులుకనిపిస్తున్నాయి.

సుబ్ర— మీరు వెళ్ళి చాలా కాలమయింది; మళ్ళి మీ నాన్నగార్ని చూడవలసి రావటం మీకు చాలా ఇబ్బందిగా ఉండిఉంటుంది.

సత్య— [తాపీగా] అవును. మా నాన్నగారి ఉత్తరం రాగానే, తల తిరిగినట్టయింది. రెండు నెలల క్రిత మనుకోండి. అప్పట్నించీ ఈ రోజు గురించే ఆలోచిస్తు న్నాను. నాన్న ఎలా పలకరిస్తారో, నేనెలా మాట్లాడాలో ఆలోచించు కొంటూనే ఈ రోజుల్లూ గడిపేశాను. ఇప్పుడంతా కొత్తగా ఉంది. [నిట్టూర్చి] సుబ్రహ్మణ్యంగారూ, ఏమోగాని, జీవితం మన మనకు కున్నదానికంటే ఎంతో సామాన్యంగా వుంటుంది. [ఆగి, నిదానంగా] జీవి తాన్ని చాలా చూశాను.

సుబ్ర— మీరు కష్టాలు అనుభవించారా ?

సత్య— ఏదో కొద్దిగా.

సుబ్ర— ఎనిమిదేళ్లు, అవునా ?

సత్య— అవును. ఎనిమిదేళ్ళు ?

సుబ్ర— లక్ష్మింపతిగారు వస్తున్నట్టున్నారు. నేను వెళ్ళాలి. సెలవ్.

[సుబ్రహ్మణ్యం వెళ్ళిపోయాడు. ఒక నిమిషం గడిచాక లక్ష్మింపతిగా గొంతుక బైట వినిపిస్తుంది. "నువ్వుకూడా రా." లక్ష్మింపతి, నరసమ్మ ప్రవేశించారు ఎవరూ మాట్లాడరు. లక్ష్మింపతి కొంత తమాయించుకొని, ప్రశాంతంగా]

లక్ష్మిం— వచ్చావా సత్యవతీ,

సత్య— వచ్చాను నాన్నా.

[మళ్ళీ ఒక్క క్షణం తటపటాయించారు. మాట్లాడాలి. ఎలాగో మా డాలి. లక్ష్మింపతి కష్టంమీద నవ్వాడు. సత్యవతి చటుక్కున నరసమ్మను కావలించు కొంటుంది. ]

సత్య— పిన్నీ

నర— వచ్చావా నాతల్లీ.

లక్ష్మిం— [కొంచెం తమాయించుకొని] కూర్చోండర్రా.

సత్య— సుభద్రకోసమని వచ్చాను. దానికోసం నాప్రాణం కొట్టుకుపోతుంది. [ఆగి] దానికి పెళ్ళయిందా ?

లక్ష్మిం— లేదు. దానికి పెళ్ళిచేసుకోవాలని లేదట.

సత్య— దానికి ఇరవైమూడో ఏడనుకుంటాను.

నర— అవును.

లక్ష్మిం— ఇరవై మూడా ? ఇరవై నాలుగా ?

నర— ఇరవై మూడే.

సత్య— ఏది అదీ ?

లక్ష్మిం— పిలుస్తానుండు.

సత్య— సరోజ ?

లక్ష్మిం— దానికి పెళ్ళయిపోయింది. మంచిసంబంధమే దొరికిందిలే. బాగా స్థితిపరులు. జరుగుదుమిల్లి సీతారామయ్యగార్ని ఎరుగుదువు కదూ ?

సత్య— తెలియదు.

లక్ష్మిం— ముసిలాయన; గెడ్డం అదీ వుంటుందీ ?

సత్య— తెలియదు.

లక్ష్మిం— అతనే సరోజ మామగారు. అంటే జరుగుమిల్లి నాగేంద్రం తండ్రి.

సత్య— ఓహో అక్కడనే వుందా ?

లక్ష్మిం— [కంగారుగా] అవును. అందాకా ఇక్కడే ఉందామని నాలుగు రోజుల భర్తతో సహావచ్చింది. తెణుకులో మనిల్లు—వాళ్ళకి రాశిచ్చాంలే—దాని పడమటింటి గోడపడి పోయింది.

సత్య— ఓహో !

లక్ష్మిం— [కంగారు మరీ హెచ్చిపోతుంది] ఆ గోడ తీయించి రాతి ఫౌండేషన్ వేయించుకోండర్రా అని చెప్పాను. నా మాట వినందే అందుకే ఇలా వీధిన పడ్డారు. పదిదలు కాస్త తగ్గాయింటే ఇంక వెళ్ళిపోతారు. ఇప్పటికన్నా కాస్త బుద్ధితెచ్చుకొంటే బాగు పడతారు.

సత్య— [క్షణం ఆగి] అచ్చాఫీసు ఎలాఉంది.

లక్ష్మిం— చాలా లాభసాటిగానే ఉంది.

సత్య— మీ ఆరోగ్యం ?

లక్ష్మిం— పరవాలేదు. నిరుడు నాకు కొంచెం షోపిరి తిత్తులు బాధపెట్టాయిగాని, మళ్ళీ వెంటనే సర్దుకున్నాయి.

సత్య— పోనీండి. [నిశ్శబ్దం].

లక్ష్మిం— బాగా పెద్దవాణ్ణి అయినట్టున్నాను కదూ?

సత్య— అబ్బే, అంత విశేషంగా కాదు.

లక్ష్మిం— నీ ఆరోగ్యం బాగుంటోందా?

సత్య— మీ ఆశీర్వచనం వల్ల. [మళ్ళీ ప్రతిష్టంభన సత్యవతి లేచి నిలుచుంది. మిగతా వాళ్ళు కూడా]

లక్ష్మిం— ఇంక నువ్వు వెళ్ళిపోవాలా?

సత్య— అవును. వెడితే కాని... [మళ్ళీ ప్రతిష్టంభన]

లక్ష్మిం— స్టేషన్ నుంచే వచ్చావా?

సత్య— హోటల్లో నాసామాన్లూ అవీ పెట్టుకొని సరీ వచ్చాను.

లక్ష్మిం— యమ్. యల్. హోమ్‌లోనా?

సత్య— అవును.

లక్ష్మిం— బాగుంది. అయితే రేపు కలుసుకుందాం. నాలుగుగంటల కల్లా, ప్లీడర్ గారింటి దగ్గర కొస్తే—అదిగో మన ఇంటి ముందే ఉంది. [కిటికీలోంచి చూపిస్తాడు] మరిచిపోకు.

సత్య— అలాగేలెండి. [ఆగి] సరోజ—అక్కడుందా? [గదివైపు చూపుతుంది.]

లక్ష్మిం భ భ, ఏదో ఆలోచిస్తున్నాను. మరచి పోయాను. అవును; ఆగదిలో ఉంది. తీసికెళ్ళవే లోపలికి. వెళ్ళి చూడు. సుభద్రని కూడా పిలిపిస్తానుండు.

నర— [తలుపు తోస్తూ] సరూ, మీ సత్యవతక్క వచ్చిందే.

సరో— [గదిలోంచి] ఇలా లోపలికి రమ్మను.

[సత్యవతి లోపలికి వెళ్ళింది]

లక్ష్మిం— [నరసమ్మతో] ఏం? ఇంతవరకూ బాగానే జరిగిందికదూ? నేను కంగారు పట్టిందంతా మరిచిపోయాను కాని అయినా ఫరవాలేదు. ఏమంటావ్.

నర— అవున్లెండి. దాన్ని చూస్తే గుండె తరుక్కుపోతోంది.

లక్ష్మిం— దానికేమే రంగడు కుచ్చులా వుంది. జమీందారు భార్యకూడా అంత ఠీవిగా వుండదు. దాన్ని చూసి ఇలాంటిదని ఎవరనుకొంటారు చెప్పు? [నరసమ్మ తల ఆడిస్తుంది]. చూశావూ చదువుకొన్నదంతా వూరికే పోతుందంటావా? దాన్ని చూడగానే తలకిందులై పోతానని భయపడ్డాను మొదట్లో. అవునా, దానికి బదులు—అలా అని కంగారు పడలేదని కాదు. కాని, నేను అనుకొన్నంత కాదు—కాళ్ళు తేలిపోయి, కళ్ళు పైన కమ్మేశాయి. [కూర్చుని] ఇలా

వర్తించటం నావిధి కాకపోతేనా—నావిధి కాదంటావా ? [ఆగి] నువ్వు నోరు విప్పవాయెసరి; ఖర్మ. అదినా విధి కాదంటావా ?

నర— నాకు తెలియదు.

[సుభద్ర వచ్చింది.]

లక్ష్మిం— సత్యవతి—

సుభ— విన్నాను. సుబ్రహ్మణ్యం చెప్పాడు.

లక్ష్మిం— [నిర్లక్ష్యంగా] జాగ్రత్తసుమీ ; శాపనార్థాలేమీ పనికిరావు. అవిడనేదో వుద్ధరిస్తోన్నట్టుమాత్రం మాట్లాడకు తెలిసిందా ?

సుభ— తెలిసింది.

లక్ష్మిం— [భార్యతో] సుభద్ర వచ్చిందని ఆవిడతో చెప్పు.

[రాముడు వచ్చాడు]

రాము- మిమ్మల్ని మీ వియ్యంకుడుగారు రమ్మంటున్నారటండి. ఎవరో మని షొచ్చాడు.

లక్ష్మిం— సరే, వస్తున్నానని చెప్పు. రామాయణంలో ఇదొక పిడకల వేట్లాట. [భార్యతో] వాళ్ళెందుకు రమ్మన్నారో నాకు తెలుసులే పద. [రాముడు, లక్ష్మింపతితో నిష్క్రమణ. నరసమ్మ లోపలి కెడుతుంది]

[సత్యవతి బైటకొచ్చి చటుక్కున సుభద్రదగ్గరకి వెళ్తుంది. సుభద్ర ముభా వంగా ఉండటం చూచి తెల్లపోతుంది]

సత్య— సుభద్రా !

సుభ— సత్యవతీ ! [ఇద్దరూ కొయ్యబారి అలాగే నిలబడి పోయారు.]

సత్య— ఎంత మారి పోయ్యావే నువ్వు.

సుభ— నువ్వుకూడా మారి పోయావు.

సత్య— నా జీవితం సక్రమంగా వెళ్ళలేదు కనక.

[సుభద్ర ముఖం చిట్లిస్తుంది] నా మాట నమ్మకం లేదా ?

సుభ— నువ్వు చెప్తున్నావుగా.

సత్య— ఇప్పుడే సరోజని చూసి వచ్చాను. నీకంటే ఆవిడే దయగా కనిపించింది. నేను ఇల్లు విడిచేపట్టటికి అదిచాలా చిన్నపిల్ల. పోగా సవితి చెల్లెలు కూడాను. నువ్వూ నేనూ ఒకేతల్లీ, ఒకే తండ్రీ కన్న బిడ్డలం. ఇంచుమించు ఒకే వయస్సు వాళ్ళం. ఒకళ్ళ కోసం ఒకళ్లు పడి చచ్చేవాళ్లం.

సుభ— [అయిష్టంగా] అవునులే.

సత్య— నిజం తెలుసుకొంటె నువ్వు తప్పకుండా క్షమించగలవని నా నమ్మకం.

సుభ— నిన్ను గురించి వినేమాటలన్నీ అబద్ధాలే అంటావా ?

సత్య— ఎంత చెడ్డవైనా వాటిల్లో కొంత సత్యం లేక పోలేదులే.

సుభ— అందుకనే___

సత్య— [శాంతంగా] అందుకనే? ___నీమంచితనంలో కూడా గర్వమూ కాఠిన్యతా ఉన్నాయి. పోనీలే. [విషయం మార్చి] నేనిక్కడికెందుకొచ్చానో నీకు తెలుసుననుకుంటాను.

సుభ— ప్లీడర్‌దగ్గర వెళ్ళేపనిమీద. మనిద్దరమూ వెళ్ళాలికనుక.

సత్య— సరే. రేపు నాలుగింటికి.

సుభ— అలాగే లే.

సత్య— [తలుపు కేసి తిరిగి] నువ్వు నాతో చెప్పవలసిందంతా ఇంతేనా ?

[సుభద్ర తల అడ్డంగా తిప్పింది. సత్యవతి వెళ్ళిపోయింది. ఒక క్షణం గడిచాక లక్ష్మీంపతి వచ్చాడు.] లక్ష్మీంపతి [హుషారుగా] వెళ్ళిపోయిందా ?

సుభ— ఆ.

లక్ష్మి— మీ అమ్మేది ? ఎక్కడికెళ్ళింది ఒసేయ్.

నర— ఏమండీ ?

లక్ష్మి— మాటచెప్పాలి.

సుభ— నేను వెడతాను నాన్నా.

లక్ష్మీం— అక్కర్లేదమ్మా.

సుభ— నాకు పనుంది.

లక్ష్మీం— సరే, వెళ్ళమ్మా, వెళ్ళు. [సుభద్ర వెళ్ళిపోతుంది. లక్ష్మీంపతి హుషారుగా చేతులు నలుపుతూ] వాళ్లెందుకు రమ్మన్నానో తెలుసా ?

నర— ఊహుఁ.

లక్ష్మీం— ఆశ్చర్యం లేదులే. ఇరవై ఐదు వందలు ఇస్తానన్నానుకదూ: పెళ్ళయిన ఆర్నెల్లకి.

నర— అవును.

లక్ష్మీం— సరోజ పెళ్ళై ఇప్పటికి సరిగ్గా ఆర్నెల్లు పూర్తయింది,

నర— అమ్మయ్యో కొంపముంచారు. ఏంచేశారయితే ?

లక్ష్మీం— ఏమీ ముంచలేదు. చిల్లిగవ్వకూడా ఇవ్వకుండా వచ్చాను.

నర— అవును, అంతకన్న ఏంచేస్తారులెండి ... వాళ్ళుగాని కోర్టుకెక్కుతారేమో.

లక్ష్మీం— ఏమీ భయంలేదు, పట్టీ నోటిమాటేగా.

నర— అదృష్టమే.

లక్ష్మీం— నేనా ఇరవైఐదువందలూ ఇవ్వనని గాని. ఇవ్వాలనటం అబద్ధమనిగాని చెప్పలేదు.

నర— ఏమన్నారు?

లక్ష్మిం— నువ్వు అక్కడ ఉంటే ఎంతో బావుండుననిపించింది. నువ్వు కడుపు చెక్కలయ్యేలా నవ్వేదానివి.

నర— సరిగ్గా చెప్పండి!

లక్ష్మిం— నేను చాలా తమాషా చేశానులే. వాళ్ళముఖాలు నిలువుగా మాడిపోయాయి. అందులోనూ నీ వియ్యపురాలి ముఖంచూడాలి, [పగలబడినవ్వి] ఫొటో తియ్యాల్సిందే. మనస్సు బాగులేనప్పుడు నవ్వుకోటానికి పనికొచ్చును. హా! హా! హా!

నర— [నవ్వుతూ] చెప్పండి.

లక్ష్మిం— ఫోటోకి లక్షరూపాయలన్నా పెట్టి కొనేవాణ్ణి. వాళ్ళతో అన్నాను [గంభీరంగా] "సరేనండి; ఇవాళ మీకు ఇరవై ఐదువందలూ ఇస్తానని చెప్పిన మాట నిజమే. కాని, నేను ప్రస్తుతం ఇచ్చేస్థితిలో లేను." అగ్నిపర్వతం బ్రద్దలయ్యింది? నఖశిఖ పర్యంతం భగ్గుమంది! దూర్వాస మహామునులై విరుచుకుపడ్డారు! తిట్లు, దీవెనలు ఒకటేమిటి! అన్ని మంగళాష్టకాలూ అయ్యాయి. నవ్వుతూ అతుఫాను చల్లారిందాకా చూశాను. బాపనమ్మ ఇక్కడ కూర్చుంది; సీతారామయ్య అక్కడ; నేనిక్కడ. వాళ్లు మాట్లాడుతూన్నంతసేపూ నేను ముఖం ఇలా పెట్టాను [ఒట్లించి]. వాళ్ళూ ఊరుకోగానే నాకథ మళ్లీ ప్రారంభించాను. 'మీకు బాకీలేదనటంలేదు; నాలుగురోజులు ఆగమనిమాత్రమే నేను ప్రార్థిస్తున్నాను. ఈసారి కానలిస్తే వ్రాతమూలకంగా ఇస్తానుకూడా." అన్నాను. దానితో యుద్ధరంగంఅంతా మారిపోయింది. నవ్వులు, క్షమార్పణలు ఒక్కటేమిటి! ప్రత్యక్షంగా మర్యాదస్తులైపోయారు. చాలా పెద్దవంశంవాణ్ణని, అడినమాట తప్పనని వగైరా వగైరా తెగపొగడేశారు. వాళ్లయిష్టంవచ్చినట్టు పొగడనిచ్చాను. నవ్వుతూనే సుమా! గంభీరమైన నిశ్శబ్దంలో ఒక తావు తెల్లకాయితం తీసుకొని, కొంత రాసి, అద్ది, మళ్ళీరాసి, మళ్ళీఅద్ది — నాకాలాన్నంతా తీసుకున్నాను. బాపనమ్మకింక పట్టపగ్గాలు లేకపోయాయి. నమ్ము నామాట, ఆ కాయితం చేతిలో పెట్టాకరా నాయుడూ, ఆవిడముఖం చూడాలి. కాయితంలో ఇలా రాశానులే. "జరుగుమిల్లి సీతారామయ్యగారి ఏకైక అన్నగారి అనంతరం వచ్చే సొమ్ములో ఇరవై ఐదువందలూ చెల్లించగలననిన్నీ..." హా! హా! హా!

నర— [నవ్వుతూ] అద్భుతం!

లక్ష్మి— బాగుందికదూ;

నర— బాగుంది.

లక్ష్మి— అవునంటావా? నిజం? చెప్పవోయ్! బాగుందా?

నర— చాలా చాలా బాగుంది.

లక్ష్మి— బాపనమ్మగారు చదువుకోంటూంటే తప్పకుండా ఫిట్టొచ్చి పడిపోయిందను కున్నాను. "ఇంతకంటే అవమానంలేదు!" కెవ్వుమని అరిచింది, నిజం, వెధవ అని తిట్టిందికూడా, ఇక నేనా ? నవ్వుతో చచ్చేటట్టున్నాను. చిన్నన్న వాడితో చెప్పకోమని చెప్పి సైకిల్ మీద పరుగెత్తుకొచ్చేశాను.

నర— [లౌకిక జగత్తులోకొచ్చి] సరోజకు దీనివల్ల చిక్కులు రావుకదా.

లక్ష్మిం— ఏడిశాయి.

నర— దానిపరిస్థితులేమీ బాగోలేనట్టు కనపడుతోంది. అల్లుడు దాన్ని నలిపేస్తు న్నాడు. వాడి క్రూరత్వం భరించలేకపోతోందని. ఎప్పుడూ తలుపులు వేసు కొని ఏడుస్తూనే ఉంటుంది.

లక్ష్మిం— పెళ్ళయిన కొత్తలో అంతా అలాగే ఏడుస్తారులే. మనుష్యుల అభిప్రాయాలు మారాలి; అలాంటి పెళ్ళిళ్లే చివరికి ఎంతో బాగు పడతాయి.

[సరోజ వచ్చింది] దీనితో నా కథంతా చెప్పు. ఏమీ కొంప మునిగిపోదులే; ఫరవాలేదని చెప్పు. దాని కర్తవ్యం నచ్చచెప్పు. [సరోజతో] ఏమే, మీ సత్యవతక్క నీతో ఏం చెప్పిందే ?

సరో— ఏమీ చెప్పలేదు. ఆవిడ నన్నెరగదు; ఆవిణ్ణి చూడకుండా ఉంటే నే బాగుండేది.

లక్ష్మిం— నేను చెప్పానుగదా ! సరే వస్తాను; ఆఫీసులో ఎలా ఏడుస్తున్నారో ఏమిటో [వెళ్తాడు]

నర— అమ్మలూ, మీ ఆయన వస్తూనే ఈ వేళ నీమీద కారాలూ మిరియాలూ నూరతాడనుకుంటాను.

సరో— ఎప్పుడూ ఉన్న భాగోతమేగా — నాకూ అలవాటై పోయింది.

నర— రోజూకంటే ఈ వేళ మరీని.

సరో— అదేం ?

నర— మీ నాన్నగారు మాట దక్కించుకోలేక పోయారు.

సరో— ఆ ఇరవై ఐదువందలమాటా ?

నర— మీ ఆయనకా సంగతి ఈ పాటికి తెలిసుంటుంది.

సరో— ఫరవాలేదులే. [అకస్మాత్తుగా, తృళ్లిపడి] రాముణ్ణి పంపించి బట్టలు తెప్పించ మన్నారు; మరిచిపోయాను. అన్నట్టు ఆ వెధవతో చెప్పానుకూడా. చెప్పకపోతే నా పేగులు తోడేసేవారే !

నర— అవునులే భర్తకదా మరి.

సరో— ఆయన తలకి'నా అంతట నేను కొబ్బరినూనె రాయటం మరిచిపోయా నని మొన్న ఉదయం కొట్టినంత పని చేయటం సహజమేనంటావ్ ? ఫలానా

జమీందారుగారి భార్య నన్ను చూస్తుంది కనుక నేను శివాలయానికి వెళ్ళటం కూడా అవసరమంటావ్! అతనిష్టంవచ్చిన ఆజ్ఞలివ్వనీ. నేనుమాత్రం ఎక్కడికీ వెళ్ళను. ఏమైనాసరే నేను వెళ్ళను.

నర— గోరంత విషయాన్నికూడా నువ్వు కొండల్ని చేస్తున్నావ్ అమ్మలూ, నీకు సౌఖ్యంగా లేదా?

సరో— [వెటకారంగా] అబ్బో, కావలసినంత సౌఖ్యంగా ఉంది.

నర— మీ ఆయనకి నువ్వంటే ఇష్టమేకదా?

సరో— ఆ "ఇష్ట" మనే మాటకి నువ్వు చెప్పే అర్థాన్నిబట్టి ఉంటుంది.

నర— నీమీద అతనికెంతో ప్రేమకదా అని అడుగుతున్నాను.

సరో— అలాగే అనుకుంటాను.

నర— అందుకని అతనిమీద కోపమా నీకు?

సరో— నాకు ఎవరిమీదా కోపంలేదు. నామీదే నాకుకోపం.

నర— ఏమిమాటలే అవి!

సరో— నన్నుచూస్తే నాకేసిగ్గేస్తోంది.

నర— నాకు అర్థంకావటం లేదు.

సరో— నాకూ అర్థం కాలేదు. ఇంక ఆ ప్రసంగం వొదిలిపెట్టు; నీకు పుణ్యముంటుంది.

నర— అదికాదమ్మలూ.

సరో— [కోపంగా] అతనంటే అరికాలిమంట నెత్తికెక్కుతోంది. తెలిసిందా?

నర— ఎందుకో చెప్పు నాతో.

సరో— ఆ అయిష్టతకి కారణమేమీలేదు. అదిపుట్టి మేమిద్దరమూ కలిసిఉన్న ప్రతీక్షణమూ పెరుగుతోంది. ప్రతీక్షణమూఏదో స్వల్పవిషయాన్నిగూర్చి కొట్టుకుంటున్నాం. ఏ విషయంమీదా మాకు ఒకే అభిప్రాయంలేదు. ఆయనదారి వేరు, నాదారి వేరు. మా ఇద్దరికీమధ్య కొన్ని వందలమైళ్ళ అఖాతం ఉంది. ఆ అఖాతం రోజురోజుకీ పెద్దదవుతూ ఉంటుంది. [బరువుగా నిట్టూర్చి] క్రమక్రమంగా నా కలలన్నీ చెరిగిపోతున్నాయి. మా స్వభావాలు పరస్పరం అర్థమైనకొద్దీ మరింత దూరమైపోతున్నాం. ఒకళ్ళనొకళ్ళం ఎంతబాగా అర్థంచేసుకొంటే అంతబాగా అసహ్యించుకొనే స్థితిలోకొచ్చాం. ప్రతీరోజూ, ప్రతిగంటా మేము పోగుచేసుకుంటూవచ్చిన అసహ్యానికి మరికొంత చేరుస్తున్నాము. విడాకులు పుచ్చుకొంటేతప్ప ఈ జీవితమల్లా కుళ్ళిపోకతప్పదు. [ఆపి] అన్నెల్లక్రితం నన్ను ఓ అయ్యచేతుల్లో పెట్టి, మీచేతులు కడుక్కోవటంకోసం, నాకంఠానికి బండరాయికట్టి నన్నుగోదావరిలో పారేశారు. కన్నతాడు కంఠానికి తగిలించుకొని, ఈ గదలో బంధింపబడి అతనికి కైంకర్యం చెయ్యబడ్డాను.

కెవ్వుమని కేకపెట్టి పారిపోదామనుకుంటున్నాను. తీరా నేను భార్యనీ అతను నా భర్తా. అమ్మా, ఇంత అవమానం దేనికే నాకు ?

నర— నువ్వు అలా అంటే కాదు; అతనుకూడా మంచివాడే. ఎంతోమంది ఆడాళ్ళు అతనంటే పడిఛస్తారు.

సరో— అదేనయం నాకు. ఈ బాధలో ఈ దుఃఖంలో నాకు ఓదార్పు నిచ్చేది, ఇవ్వ గలిగిందీ చంటిపిల్లతే. పిల్లలకోసమని ఆాకపోతే—

నర— దేనికయినా తొందర కూడదమ్మా. శాంతం ఉండాలి. క్రమక్రమంగా అన్నీ చక్కబడతాయి; అంతవరకూ ఓపిక పట్టాలంతే.

సరో— అలాగే ములిసిదాన్నయితే సరి.

నర— ముసిలితనం వచ్చేదాకా తప్పదు మరి.

సరో— చాల్లే, గొప్ప మాట చెప్పావ్.

నర— ఏమైనా నీకంత ఆగ్రహం కూడదు. కనీసం మాకోసమన్నా నువ్వు కొంచెం తమాయించుకోవాలి.

సరో— గొప్పమాటే [నాగేంద్రం వచ్చాడు] ఇదిగో ఆయన వచ్చారు; నువ్వు వెళ్ళమ్మా, నువ్వు మరీ ఘోరంచేస్తావ్. [నరసమ్మ వెళ్ళిపోయింది.]

నాగేం— ఇక మీ పప్పు ఉడకదు. ఇలాంటి పెధవవేషాలు నా దగ్గిర పనికిరావు. మీ నాన్న ఏమన్నాడో విన్నావా ?

సరో— విన్నాను.

నాగేం— నీకేమీ చీమకుట్టలేదు; అవునా ?

సరో— అంతకన్న ఆయనకి గత్యంతరంలేదు.

నాగేం— ఆయన అలా చేయటం నా ఆశలన్నింటినీ గంగలో కలిపింది. మీ రంతా కలిసి కుట్రపన్నుతున్నారు నా మీద, మీ కుటుంబమంతా ఒకేరకం సజ్జు. మీ నాన్న ఇరవైఐదువందలు ఇవ్వాలి. ఆయన ఇవ్వడు. మీ అక్క నిన్న ఆరు వందలిస్తానంది. ఈ వేళ 'ససేమిరా' అంది. ఇంక నువ్వా, నా బతుకు గంగలో కీడున్తున్నావు,

సరో— నేనా ?

నాగేం— నువ్వే. నేనెంత గింజుకున్నా నీకు లెక్కలేదు.

సరో— నేనేం చేశాను ?

నాగేం— ఇవాళ శివాలయానికి వెళ్ళావా ?

సరో— లేదు.

నాగేం— ఎంచేత ?

సరో— నాకు నమ్మకం లేదు కనుక.

నాగేం— నీకు నమ్మకం ఉందో లేదో ఎవడిక్కావాలి. నిన్ను శివాలయానికి వెళ్ళమన్నానంటే నీ నమ్మకానికీ నేను వెళ్ళమనటానికీ సంబంధం లేదు. మొగుడు చెప్పాడు కనుక ఆడది చేసితీరాలి. నమ్మకం లేదనుకో, నమ్మినట్టే చెయ్యాలి, గొప్పవాళ్ళ పెళ్ళాలంతా అలాగే చేస్తారు. వాళ్ళకిమల్లేనే నువ్వు కూడా చెయ్యాలంటాను. తెలిసిందా? నా కాతాదార్లంతా శివమతస్థులై ఉంటే నేను ఏ సోషలిస్టునో కమ్యూనిస్టునో అయే ఉద్దేశం లేదు నాకు.

సరో— నే నెప్పుడూ దేవాలయానికి వెళ్లిందీలేదు; వెళ్ళేదీలేదు.

నాగే— ఏమిటంటున్నావ్?

సరో— నే నేమిటన్నానో మీరు విన్నారు. మీకు దేవుడిమీద దెయ్యంమీదా భక్తి ఉంటే, నన్నుకూడా మీలాగా ఉండమనికోరితే, మీకోసం తప్పకుండా అలా చేద్దును. మీ వ్యాపారంకోసం కొంగజపాలు చేయమంటేమాత్రం నావల్ల కాదు. నేనలా ఒఖనాటికి చెయ్యను.

నాగే— అయితే నీ ఇష్టంవచ్చినట్లు చేస్తానంటావ్?

సరో— అవును; నిజం చెప్పారు. నా ఇష్టంవచ్చినట్టే చేయాలనుకుంటున్నాను ఈసారి తెలిసిందా? అంతే. జీవితంలో ఒక్కసారి నా ఇష్టంవచ్చినట్టు చేస్తాను. నా చిన్నతనమల్లా అందరి అడుగులికీ మడుగులొత్తుతూనే గడిపాను. ఎంత నిర్దయగా, ఎంత విచక్షణాశూన్యంగా అధికారం చలాయించినా పెద్దవాళ్ళమాట శిరసావహించాను. ఇప్పుడుకూడా బానిసబతుకేనా? ఎప్పుడూ బానిస బతుకేనా? ఈ బానిసత్వం ఇప్పటికీ, నా పీకలమీద కొచ్చింది.

నాగేం— అయితే పెళ్ళి చేసుకోవటం మానెయ్యాల్సింది.

సరో— అలాఅయితే ఈ బాధలేదు. మీ భార్య పనల్లా మీకు అగ్గగ్గలాడుతూ, వేరే నౌఖరీ వెధవ అక్కర్లేకుండా, మీ బట్టలుతికి, మీ కాళ్లుపిసికి, మీకు కూరలొండుతూ చావటమేనా?

నాగేం— పిచ్చిగా మాటాడకు.

సరో— పిచ్చిమీకా నాకా?

నాగేం— నీకు తెలుసు, నువ్వు నిర్వర్తించవలసిన విధులెన్నో ఉన్నాయని. నీకు సౌఖ్యం కావాలంటే అది నీలోనే ఉందనికూడా నీకు తెలుసు. నిన్ను నేను ప్రేమిస్తున్నానని కూడా నీకు తెలుసు.

సరో— అవునవును; ఆ సంగతి మర్చిపోయాను. నువ్వు ప్రేమిస్తున్నావ్ కదూ! అంటే నీకవసరమైనప్పుడల్లా లోబడి పోవటమే కదా. పెళ్ళామంటే ఇల్లు ఊడ్చటానికీ మంచమెక్కటానికీనని మీ అభిప్రాయం. నేను మాత్రం ఇంక ఏమైనా నీకు చాకిరీ చేస్తూ నీ అవసరాలికి లొంగుతూ పడుండేదిలేదు.

నాగేం— ఉత్తమ ఇల్లాలికి అంతకంటే ఇంకేమి కావాలో నాకు తెలియటం లేదు. వాళ్ళు ప్రేమించిన భర్తలకి పాదసేవ చేస్తూ అదే సర్వస్వంగా సంతుష్టులైన ఆడాళ్ళు ఎంతోమంది ఉన్నారు.

సరో— నేను మిమ్మల్ని ప్రేమించిఉంటే అలాగే అనచ్చు. కాని నేను మిమ్మల్ని ప్రేమించటం లేదు.

నాగేం— చాల్లే ఊరుకో. ఎవరైనా నవ్విపోతారు.

సరో— నేను నిన్ను ప్రేమించటం లేదు.

నాగేం—నాకు ఒళ్లుమండిపోతోంది. నా ఇష్టమొచ్చినట్టుమాట్లాడానంటేఏడుస్తావ్ నువ్వు.

సరో— అదేదో మాట్లాడండి!

నాగేం— ఎందుకులే.

సరో— ఉన్నదేదో అనండి. ఇంతకంటే అవమానం ఇంకేముంటుంది? ఇక్కడెవ్వరూ లేరు. ఏమీ ఫరవాలేదు. మనసులో ఉన్నదున్నట్లుగా మాట్లాడేసుకొని తెగ తెంపులు చేసుకోవడం చాలా నయం. అలాని ఎన్నాళ్ళబట్టో అనుకుంటున్నాను. మీ రనేదేదో అనేయండి, వదిలిపోతుంది.

నాగేం— అనను.

సరోజ— అయితే నేను చెప్తావినండి. నేను మిమ్మల్ని ఎన్నడూ ప్రేమించలేదు. మీరు దొంగ నవ్వు నవ్వకండి. నవ్వటానికిది సమయం కాదు. మీ మగాళ్ళకి సరదాగా ఉండే ఆడాళ్ళ దుఃఖమూ, దుఃస్థితీ నాకొక్కర్తికే కాదు, ఇంకా ఎందరికో అనుభవమయింది.

నాగేం— నీ యభిప్రాయమేమిటో నాకు తెలియటంలేదు.

సరో— మీకు తెలుసు. మీ దర్పం మీకు తెలియనట్టు మీచే నటింపజేస్తోంది. నేను ధైర్యంగా మాట్లాడలేనని మీ అభిప్రాయమేమో; కాని నేను మాట్లాడతాను. మీరు ముద్దు పెట్టుకొంటూంటే నా పెదవులు వెనక్కి తగ్గి మళ్ళీ బలవంతాన మీకు లొంగి పోతాయి. ఇంకా చెప్పమన్నారా? [ఆగి, అతని ముఖంలోకి సూటిగా చూస్తుంది] ఇప్పటికన్నా తెలిసిందా? నా కన్నీళ్ళన్నీ ఆనంద బాష్పాలని ఎన్నడూ అనుకోకద్దు. నా దుస్థితికీ నా దౌర్భాగ్యానికీ అవి కారే కన్నీళ్ళు! నువ్వు ముద్దు పెట్టుకున్నాక నిన్నెంత అసహ్యించుకొంటానో! మన ప్రేమ ఒక కుస్తీ పట్టులా అయి అందులో నాలో ఏదైతే గొప్పదో అదే నన్ను మీ ముందు చిత్తు చేస్తోంది. నీ విజయాన్ని చూస్తే నాకు సిగ్గేస్తోంది. నాలో ఏదైతే నీచంగా ఉంటుందో అదే నీ విజయానికి సాయపడుతోందని గ్రహించి నన్ను నేనే అసహ్యించుకొంటాను. నేను కాదు మీకు లొంగుతూంట! నాలోని పశువు మీకు పాదాక్రాంతమౌతోంది. ప్రేమలేని వివాహమనే ఈ నేరానికి నువ్వంటేనే అసహ్యం నాకు. ఆ నేరంలా

నన్ను వాటా తీసుకోమంటావ్ నువ్వు. నాకు తెలుసు; ఈ తప్పంతా నీవొక్క డిదే కాదని నిన్ను ఒక్కర్తెనే అసహ్యించుకోవటం తప్పనికూడా నాకు తెలుసు. చాలు. బాబూ ఇంకచాలు. ఈ రాత్రిళ్ళ అవమానాన్ని తలచుకొని ఇంక ఏడ్వటం నాతరంకాదు. ప్రతీ సాయంత్రం నా స్వతంత్రాన్నిగూర్చి ఆలోచించుకొనేదాన్ని. అయినా నన్ను విముక్తంచేసేమాటల్ని ఈవేళదాకా అనలేకపోయాను. ఇంక అయిపోయింది. ఇంక నేను స్వేచ్ఛగా బ్రతకవచ్చు.

నాగే— ఏమీ అవలేదు. అలా అయిందనుకోకు.

సరో— ఏమిటి నీ ఉద్దేశం ?

నాగేం— నా ఉద్దేశమా ? అయితే చెప్తావిను. నాకు నీకంటే ఎక్కువ తెలివి తేటలే ఉన్నాయి, నీ పిచ్చి పిచ్చి కలలనించి నిన్ను కాపాడడం నా విద్యుక్త ధర్మమంటున్నాను. మనల్ని ఏకం చేసిన సంబంధాలు, తెంపేసు కుంటే తెగిపోయేవి కావు. నువ్వు నా భార్యవి. నువ్వెక్కడికెళ్ళినా పలానా వాడి భార్య అంటారు కాని నీ ఇష్టమొచ్చినట్లు అనరు. నానుంచి తెగ తెంపులు చేసుకోవాలనుకోవడం కల్ల. దానికి తగినంత కారణంకూడాలేదు. నన్ను విడిచిపోతానంటావే అనుకో 'మబ్బు విడిచిన ఎండ, మొగుడు విడిచిన ముండ' అని నలుగురూ హీనంగా చూస్తారు. అలాంటి ఆడదానికి సామాజిక ప్రతిపత్తిగాని, గౌరవంకాని ఉండవు. ఇట్లోవాడు 'వెధవా' అన్నాడు కనుక రోడ్డుమీదవాడిచే 'ముండా' అనిపించుకోవటం మంచిదికాదు. ఏమైనా నువ్వు నాతోనే వుండాలి.

సరో— అయితే పెళ్ళంటే చెఱసాలన్నమాట [ఆగి] పెళ్ళికాకముందు ఈ చెఱసాల కోసమేనా అంత తాపత్రయ పడ్డాను! నిట్టూర్చాను! ఆశించి కలలుకన్నాను! ఆ కలలన్నీ, ఆ నిట్టూర్పులన్నీ, ఆ తాపత్రయాలన్నీ ఈ యమనరకం కోసా నికే అని గ్రహించి వున్నట్లయితే...[చటుక్కున కన్నీళ్ళు తుడుచుకొని] పిచ్చి పీనుగుని; నవ్వటానికి బదులు ఏడుస్తున్నాను. ఏమాత్రం సాహసమున్నా ఈ దుఃఖాన్నంతనీ గోళ్ళతో మీాటేసుకోవచ్చే! ఆ తగవాత, ఎంతహాయిగా, చిద్విలాసంగా బ్రదకవచ్చు! మగజాతి ఆడజాతి రక్తంపీల్చే జలగ అయిం దంటే దానితప్పుకాదు; దాన్ని అసహ్యించుకోకపోవడం తప్పు ఆడజాతిదే. మీా చేతుల్లో వివాహమంటేనే భయంకరమైన వ్యభిచారానికి లైసెన్సుగా, దగాగా, దౌర్జన్యంగా తయారైంది. అలాంటి ఘోరాన్నికూడా వివాహమని పూజించేవాళ్ళని చూస్తే...[కడుపు చెక్కలయ్యేలా నవ్వుతుంది.]

నాగేం— సరూ. ఏమిటానవ్వు?

సరో— ఇంకానయం, నవ్వుతున్నాను...ఫలానా ఫలానావారిపిల్లని ఫలానా ఫలానా వారి కుర్రాడికి ఇన్నిగంటల ఇన్ని నిమిషాల ఇన్ని సెకన్లకి ఇచ్చి వివాహం చేస్తున్నామంటే—అప్పట్నుంచీ ఆస్త్రీ ఆ మగాడి దాసవిక్రయ సర్వాధి

కారాలకి లొంగి వాడికి యావజ్జీవ బానిసలా వుండటానికి నిర్ణయింప బడు తోంటే ఈ ఆడాళ్లు సిగ్గుతో, అవమానంతో ఎందుకు చచ్చిపోరో అని పిస్తుంది. చుట్టాలు, బేండుమేళాలు, శిల్కువస్త్రాలు వీటిని చూసి మురిసిపోతారు. పాపం. మెడకి తాడు ఉరిపోస్తుంటే ఆ పెళ్ళి కూతురు దుస్థితిచూస్తే జాలే స్తుంది. (అతని భుజంపైచెయ్యివేసి) పెళ్ళికొడు కెలావుంటాడో చెప్పడం మరిచి పోయాను. (నవ్వుతూ) తనకాహారం తప్పకుండా వస్తుందికదా అనే సంతృప్తితో కూర్చున్న జంతువులా ఉంటాడు మీకు కట్నాలు కావాలి? మిమ్మల్ని డబ్బిచ్చి కొనుక్కోవాలి. మమ్మల్ని పెళ్ళిచేసుకోవటం కోసానికని మీకు లంచమివ్వాలి. మీకు అందమైనది, పనిపాటలు చేతయింది, బుద్ధిమంతురాలు, సినిమా పాటలు పాడేది కావాలి. ఆడదానికి మాత్రం అలాంటి ఎన్నిక చేసు కునే హక్కు అఖ్ఖర్లేదు.

నాగేం— తప్పంతా నాదేననటం సబబైన పని కాదు. కేవలం నాతప్పే కాదు, నీతప్పు కూడా వుంది ఇందులో.

సరో— చిత్తం అదేమిటో సెలవివ్వండి.

నాగేం— చెప్తావిను.

సరో— నావిధిని నిర్వర్తించటంలో ఎప్పుడైనా లోపం చేశానా? మీరు కోరినప్పుడు మీకు కావాలన్నప్పుడు——

నాగేం— (తీవ్రంగా) ఆపు అక్కడికి. నేను చెప్పదలచు కున్నదేమో చెప్పనీ. పెద్ద ఏదో నీకే అన్యాయం అంతా జరిగిపోయినట్టు మాట్లాడుతున్నావ్. ఆ మాత్రం అన్యాయం నాకూ జరిగింది. నిన్నిచ్చి నాకు పెళ్లి చెయ్యాలని మావాళ్ళను కున్నప్పుడు నాకు నీమీద ప్రేమ లేదు. ఆ సంగతి ఒప్పుకుంటున్నాను. నువ్వు నానించి ఆశించినంతగా నిన్ను నేను ఎన్నడూ ప్రేమించలేదు. అయినా నన్ను పెళ్లిచేసుకోటానికి ఒప్పుకున్నావ్.

సరో— నాకేం తెలుసు! ఆరోజుల్లో నాకు జీవితమంటే ఏం తెలుసు?

నాగేం— ఆర్నెల్ల క్రితం సంగతి మాట్లాడుతున్నాను. తన కూతురు అందాన్ని చూసి మొగాడు ఎలాంటి ప్రేమ పొందాలని ప్రతి తల్లీ వలవేస్తూ ఉంటుందో అలాంటి ప్రేమే నాదీనని నీకు తెలుసు. ఈ నాటకంలో కూతుళ్ళు కూడా తగ్గ పాత్ర ధరిస్తారు.

సరో— నేను కూడా అలాంటిదాన్నే నంటారా?

నాగేం— నిస్సందేహంగా. సరే నిర్మొహమాటంగా కథ ప్రారంభించావు కనుక నేను కూడా దాని తుద చూస్తాను. పట్టు నీదేనంటావ్. నాకేమీ అభ్యంతరం లేదు. ఇప్పటికి— పెళ్ళంటే మన పెళ్ళి కానీ, ఇతరుల పెళ్లి కానీ, అసలు పెళ్ళంటే ఏమిటో మనకి అర్థమయింది. అందులో ఎన్ని నాటకాలు, దగాలు,

మాదచ్చోదీలు, జరుగుతాయో మనకి పూర్తిగా తెలిసింది. మీ వాళ్ళు మావాళ్ళకి టోపీ వేశారు.

సరో— మీవాళ్ళే ?

నాగేం— మావాళ్ళూ అంతే చేశారు; నేను కాదనటంలేదు. కాని నువ్వు మీవాళ్ళకి సాయం చెయ్యలేదా ?

సరో— లేదు.

నాగేం— నీ సాయశక్తులా చేశావు. నాకు బాగా జ్ఞాపకముంది. నన్ను గారడీచెయ్యడానికీ, బోనులో వెయ్యడానికీ, మాయ చెయ్యడానికీ చాలా ప్రయత్నం చేశావ్. ఆ సంఘటన చాలా నవ్వుబాటుగా వుందని నాకు తెలుసు. అయినా నేను దానిని అక్కడే మరిచిపోయాను. నాకు టోపీ వెయ్యాలనీ, నువ్వు కోరి వేసిన వేషాలు మాత్రమే నాకు జాలికలిగిస్తాయి. నా దౌర్బల్యాన్ని కనిపెట్టావ్. నాకు డబ్బుమీదవున్న వ్యామోహంసంగతి గ్రహించావ్—ముక్కుకు సూటిగా మాట్లాడుకుంటున్నాం అన్న సంగతి మరిచిపోకు—నాకు డబ్బు కాపీనం యెక్కువని తెలిసి నీ బట్టల దగ్గర్నుంచి నువ్వే తయారుచేసుకొనే ఆదర్శస్త్రీలా నటించావ్. నీకుజ్ఞాపకముందా? ఇంక త్యాగరాజు! త్యాగరాజు సంగీతం నాకెంత వచ్చో నీకూ అంతేవచ్చు; అయినా మహావిదుషిలా నటించావ్. నీకెన్నో సంబంధాలొస్తున్నాయన్నావ్. అది శుద్ధ అబద్ధం. మీ నాన్నగారి అకౌంట్లు చూసేదానివనీ, వ్యాపారమంటే చెవికోసుకుంటాననీ చెప్పావ్. అదికూడా శుద్ధ అబద్ధమే.

సరో— కేవలం అవే నా నేరాలయితే—

నాగేం— అవేకాదు; ఇంకా వున్నాయి. ఇంకొక ఘోరానికికూడా నువ్వు పాల్పడ్డావ్. అది అల్లాటప్పాయి తప్పుకాదు. నీ స్త్రీత్వంలోని హుందానంతినీ నీ భవిష్యత్తుకోసం అప్పుడే త్యాగంచేశావ్‌కూడా. నువ్వు మరచిపోయావా ? నేను మరచిపోలేదు. ఇక్కడే, ఇప్పుడు మనమున్నచోటే ఓ పట్టుచీర కట్టుకొని యెవరింటికో భోజనానికి వెళ్ళాలన్నావ్. నువ్వు యెవరింటికీ భోజనానికి వెళ్ళలేదని నాకు తరువాత తెలిసింది. మీవాళ్ళు ఆచీర కట్టుకోమన్నారు; యెందుకు కట్టుకోమన్నారో నీకు తెలుసు. సరే ఆ చిట్కాసంగతి తర్వాత హైటుగడింది. [సరోజ చేతుల్లో తలదాచుకొంటుంది]. మగాళ్ళంతా యెలా ప్రవర్తిస్తారో నేనూ అలాగే ప్రవర్తించాను. నీ పెదవులమీద ముద్దు పెట్టుకొంటానన్నాను. పెద్దకుటుంబంలో పిల్లలు యెలా అడ్డుచెప్తారో నువ్వుకూడా అలాగే అడ్డుచెప్పావ్. తీరా నేను బాధపడ్డానని గ్రహించి యెలాగైనా కాబోయే భర్తకనక ఆమాత్రం నీ సిగ్గును త్యాగంచెయ్యటం మంచిదనుకొని ఒప్పుకున్నావ్; నేనొకందుకు పోస్తే నువ్వొకందుకు తాగావ్. నిజమే నేను నిన్ను దగాచేశాను; నువ్వుకూడా నన్ను దగాచేశావ్. నువ్వూ నాలాగే

ప్రవర్తించాక, తప్పంతా నా ఒక్కడిమీదనే తొయ్యటం ధర్మంగాలేదు. [సరోజ తల క్రుంగిపోతుంది] తతిమ్మా విషయాలంటావా నువ్వు అన్నవన్నీ నేను ఒప్పుకొంటాను. నాకు ఆశయెక్కువ. ఎలాగో నా ఆశలు ఫలించాలి. సామాజిక ప్రతిపత్తి డబ్బులేకపోతే దొరకటం కష్టం. కనుక డబ్బుకోసం యెన్ని వేషాలన్నా వెయ్యాలి. మెత్తనివాళ్ళ నందర్నీ నా విజయంకోసం వుపయోగించుకోవాలి. అందుకే నీ సహాయంకూడా కోరుతున్నాను. నేనేమీ వీరుణ్ని కాను. ఈ ప్రపంచంలోని అందరు సామాన్యుల్లాంటివాణ్నే నేనూను. కనుకనే ఈ యాతనంతా తప్పదు. మనిద్దరిమీదా ఎవరైనా జాలిపడాల్సిందే. ఇక నీ మీదకంటే నామీదే ఎక్కువ జాలిపడాలి; యెందుకంటే నువ్వునన్ను ప్రేమించటంలేదు; నిన్ను ప్రేమించకుండా నేను వుండలేను. నువ్వు నన్ను విడిచిపెట్టేస్తే నా బ్రతుకేంగాను? నాస్థితి చితికిపోయింది; నా వ్యాపారం దివాలాతీస్తుంది. అన్నింటికంటే ముఖ్యంగా నేనునిన్ను పోగొట్టుకుంటున్నాను. నేను పరి చవటంపీనుగను గనకనే ఈ సంగతి ముందే నీతో చెప్పలేకపోయాను. ఇంక చేతులు కాలేక ఆకులు పట్టుకోవటమే. నీకంటే నాకే యెక్కువ అన్యాయం జరిగింది. [బాధగా] నేను నువ్వెంతకాదన్నా నిన్ను ప్రేమించకుండా వుండలేను. నువ్వు నన్ను వొదిలేస్తున్నావంటే ఎవరో నాతో నాచావు దగ్గిరకొచ్చిందని చెప్పినట్టుంది. [వెక్కుతాడు] ఇంతకీ నేనేంచేశానని? అందరు మగాళ్ళూ ఏంచేస్తారో నేనూ అంతేచేశాను. నన్నే యింతఘోరంగా శిక్షించాలా? సరూ, సరూ, నామీద కొంచెం దయచూపవా? నా మనస్సు బాగోలేదు, [చేతుల్లో తలపెట్టుకొని రాగాలు పెడతాడు].

సరో— [దగ్గిరకొచ్చి] పాపం!

నాగే— [ఇంకా యేడుస్తూ] నామీదనీకు జాలేస్తోందికదూ ?

సరో— అవును యిద్దరమూ ఆహుతైపోయ్యాం.

నాగే— కాదుమరి! నేను పుట్టినప్పట్నుంచీ కేవలం డబ్బుపోగేసుకోవటమే పరమార్థమని మావాళ్లు వుగ్గుపాలతో నేర్పారు,

సరో— [విచారంగా] మావాళ్లూ అదే అనేవారు.

నాగే— డబ్బు వుంటేనేగాని ఈ వెధవ ప్రపంచంలో గౌరవమర్యాదలు లేవు.

సరో— పెళ్ళికూడా డబ్బుసంపాదనకే ఒక సాధనమయింది.

నాగే— అదే చివరకి మనకొంప తీసింది.

సరో— మన జీవితాల్నే కాదు; అలా ఎందరి జీవితాల్ని నాశనంచేస్తోందో!

నాగేం— (కాస్త సంబాళించుకొని) ఈసారి నీకంతా అర్థమయింది. అవునా?

సరో— అవును.

నాగేం— (ఆవిణ్ని దగ్గిరికి తీసుకొని— ఆవిడ కూడా ఊరుకుంటుంది) నీకు కోపం పోయిందా? (సరోజ ఏమీ అనలేదు.) జరిగిం దాన్నంతా మరిచి పోయావు కదూ? అంతా మరిచిపోదాం. (ఆవిడ ఇంకా మాట్లాడదు.) మన వ్యాపారం దివాలా కాకుండా చూసుకోక తప్పదుకదా! అవునా?

సరో— అవును.

నాగేం— శివాలయానికి వెడితే ఏం పోయింది చెప్పు? (నవ్వి) చాలా తెలివి తక్కువగా ప్రవర్తించాం, అవునా? ఏమైనా జరిగి పోయిందాన్ని మరిచిపొయ్యాం. కదూ?

సరో— (పరధ్యాన్నంగా) అవును.

నాగేం— (ధైర్యం తెచ్చుకొని) చిలకలా చెప్పేవ్. చూశావ్వు, ఏదో తగాదా వస్తుంది. ఉద్రేకం వస్తుంది, నోటికొచ్చినట్టల్లా మాట్లాడతాం. (నవ్వి) ఎంత ఘోరంగా మాట్లాడావో తెలుసా? తలుచుకుంటే నా ఒళ్లు జలదరిస్తుంది. ఈ జన్మలో మళ్ళీ అలాంటి ప్రసంగం వద్దు. (ఆమెని మరీ దగ్గరగా హత్తుకొంటాడు; సంకోచిస్తూనే ఆమె ఊరుకుంటుంది) మళ్ళీ మనం స్నేహితులమయ్యాం. వెళ్ళి ముఖం కడుక్కొని చక్కారా; ఎవళ్ళన్నా చూశారంటే మనం ఏడుస్తున్నా మనుకుంటారు. నాకళ్ళు ఎర్రగా ఉన్నాయా? లేపనుకుంటాను. ఒక తమాషా చెప్పనా? నమ్మవ్ నామాట ఒక్కసారి తృళ్ళి పడతావ్. ఈమాటలన్నీ ఇదివరకే అనుకున్నట్టుగా భావించాను నేను. సరే దీనితో మనం ఒకళ్ళ కొకళ్ళం పూర్తిగా అర్థమయ్యాం. మన ఇబ్బందుల సంగతి నీకు తెలుసు. మనం అనుకున్నట్టుగా మన వ్యాపారం లేదు. అందుకే తరుచు చికాకుగా ఉంటున్నాను. ఇంతకంటే పరిస్థితులు బాగుపడి మనం సుఖపడాలంటే నువ్వు సుభద్రతో నాకు సాయం చెయ్యమని చెప్పాలి.

సరో— (అయినా కొంత జాగ్రత్తగా) సరే. ప్రయత్నిస్తాను.

నాగేం— చిలకలా చెప్పావ్. కొంతకాలం జాగ్రత్తగా, పొదుపుగా కాలక్షేపం చేస్తే ఉపాధకింత లోటుండదు. మనిద్దరమే కనక దర్జాగా గడిపేయచ్చు. అదృష్ట వశాత్తూ మనకి మన యావతప్ప ఇంకోసంధిలేదు. నీకు నెల తప్పిందంటే మన బ్రతుకెలా ఉండేదో?

సరో— నాకు కొంత ధైర్యంగా ఉండును.

నాగేం— వట్టి పిచ్చిదానివి. పిల్లలు లేకపోతే బతకలేం గనకనా!

సరో— [తెల్లబోయి] మనకింక ఎప్పుడూ పిల్లలు పుట్టరంటారా?

నాగేం— [ఒక నిమిషం ఆలోచించి] ఊహుఁ పుట్టరు.

సరో— ఎంచేత?

నాగేం— నాకిష్టం లేదని.

సరో— పిల్లల గురించి చాలా సార్లు మాట్లాడుకున్నాంకదా. పుట్టాక వాళ్ళని ఎలా పెంచాలో కూడా మీరు చెప్పేవారు.

నాగేం— [నవ్వుతూ] అవును ఆ కబుర్లంటే నీ కిష్టంకదా అని. ఏదో మాట్లాడు కోటానికి ఒకటుండాలికదా.

సరో— ఈ జీవితంలో మనకింక పిల్లలు పుట్టరని ఎలా చెప్పగలరు?

నాగేం— వాళ్ళని పోషించటం చాలా కష్టం. ఏ నలభై ఏళ్ళో వచ్చేదాకా ఆగి తర్వాత పిల్లల్నికన్నా మంటే జనం నవ్వుతారు.

సరో— అందుకని.

నాగేం— అందుకని పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చేయించేసుకొన్నాను.

సరో— అసలు పెళ్ళికే నేనెందు కిష్టపడ్డానో మీకు తెలియదా? పిల్లలకోసానికనే కాకపోతే మీతో ఇలా కాపరం చేయటానికి ఒక్కనాటికి కూడా ఒప్పుకో నని మీకు తెలియదా? భార్యనవటం, తల్లినవటం అదే నా జీవితానికి పర మార్థం. ఈ తీరని లోపంతో నా జీవితం అసంపూర్ణమై పోవాలి కాబోలు. నా కడుపుపండి నా రక్తమాంసాల్ని పంచుకొన్న శిశువే పుట్టకపోతే నాజీవి తం ఎందుకు! ఒక తల్లి తనచేతుల్తో బిడ్డనిసాకి, సముదాయించి, ఆనందించే తృప్తికే నేను దూరమౌతున్నానా! నా ఆనందాన్ని, నాజీవిత పరమార్థాన్ని నువ్వు దోచుకుంటున్నావా? నీకు డబ్బుమీద వ్యామోహం కొద్దీ, నీ అత్యాశ కొద్ది నా జీవితాన్ని నాశనం చేస్తావా? నా మీద నీకిలాంటి అధి కారం ఎవరిచ్చారు? ప్రజలు రాక్షస పరిపాలనని నిందిస్తారే; ప్రభుత్వాల మీద తిరగబడతారే. కాని, ఇంత దౌర్జన్యంగా, ఇంత దురన్యాయంగా ఉన్న వివాహవిధినే ఎందుకు ఎదుర్కోరు!

నాగేం— నీకు పుణ్యముంటుంది — మళ్ళీ ప్రారంభించకు. అయిపోయిందేదో అయి పోయిందనుకున్నాంకదా.

సరోజ— అయి పోయిందేదో అయి పోయిందంటావా? నిర్ణ్ణంచేస్తే పాపముంది? మళ్లీ ఈజన్మలో మనం ఏకమౌతామనే అనుకుంటున్నావా? ఇంతా కా అసంగతి చెప్పింతర్వాత మళ్ళీ నీకు లొంగి సిద్ధమౌతాననే అనుకుంటున్నావా? పిల్లలూ లేక అభిమానమూ లేక కాలిపోయే ఆడాళ్ళకి ప్రేమంటే ఏమిటో ఆలోచించు.

నాగేం— నేను నీకేమీ జవాబు చెప్పదలచుకోలేదు. నువ్వేమి చెబుతున్నావో కూడా నీకు తెలియటంలేదు. నీకు పిచ్చెత్తినట్టుంది నీధోరణి చూస్తే. కాసేపు విశ్రాంతి తీసుకో ముందు. (ఆవిడ రెక్కపట్టుకొని లోపలికి తీసుకెళ్ళాలని ప్రయత్నిస్తాడు.)

సరో— (కెవ్వుమని) నన్ను ముట్టుకోకు. తెలిసిందా? నన్ను ముట్టుకోకు. (అతన్ని పక్కకి గెంటేస్తుంది.)

నాగేం— (కోపంతో) ఇలా చూడు సరోజా, నేనింక సహించేది లేదు. ముందు నీ గదిలోకి వెళ్ళమంటున్నాను.

సరో— నన్ను ముట్టుకోకు.

నాగేం— అది నా ఇష్టం! కావలిస్తే నీ ఇష్టం వచ్చినట్టు ఏడు. నువ్వు నా భార్యవి, తెలిసిందా? నా ఇష్టంవచ్చినట్టు చేసే అధికారం నాకుంది.

సరో— నీ వెధవ చేతులు తీసెయ్ ముందు. నిన్ను చూస్తే నాకసహ్యం వేస్తోంది.

నాగేం— కావలిస్తే అసహ్యించుకో. కాని తలుపులు బిడాయించుకొంటే దేవుళ్ళాడే చవట వెధవ మొగుణ్ని కాను. తెలిసిందా? నిన్ను పెళ్లి చేసుకొన్నాను. ప్రేమించాను; నిన్ను వదలుకో దలచుకోలేదు. నన్ను అసహ్యించుకొంటావా? సరే, కాని. నీకు చేతయితే తప్పించుకో చూస్తాను. (ఆవిణ్ని చేతుల్లో బంధిస్తాడు; పెద్ద గందరగోళం. కుర్చీలు దగ్గర్నుంచి తిరగబడతాయి. ఒక్కరి నోటంటా మాటలేదు. అందరికీ ఆయాసం వస్తుంది. అకస్మాత్తుగా నాగేంద్రం అరుస్తాడు) మాదర్చోద్! కరిచావా?

సరో— నాకు అడ్డొస్తే చంపుతాను కూడా.

నాగేం— (కోపంతో) సరే చూస్తావ్ కదా, ఎవరి అధికారం చెల్లుతుందో.

సరో— చూద్దాం.

నాగేం— డానీయ్ (నాగేంద్రం తీవ్రంగా వెళ్ళిపోతాడు.)

[సరోజ, ఒక్కర్తీ, తల సర్దుకొని ఏదో సణుక్కొంటుంది. అకస్మాత్తుగా మంచంమీద పడి, అక్కణ్నుంచి కిందకి దొర్లి వెక్కి వెక్కి ఏడుస్తుంది.]



## అంకం 4

[ దృశ్యం అదే. లక్ష్మింపతి, నరసమ్మ కూర్చున్నారు. ]

లక్ష్మింపతి— అయితే వాణ్ణి వదిలెయ్యటానికే నిశ్చయించుకుందన్నమాట.

నరసమ్మ— అవును.

లక్ష్మిం— వాడో ?

నర— తీరా అంత గందరగోళమూ అయ్యాక ఇంట్లోంచి పోయాడు; మళ్ళీ తిరిగి రాలేదు.

లక్ష్మిం— అయితే రాత్రి ఇంటిదగ్గర పడుకోలేదన్న మాట.

నర— లేదు.

లక్ష్మిం— వెధవ, వాళ్ల అమ్మదగ్గిరకి పోయినట్టున్నాడు. [కిటికీ దగ్గరకెడతాడు]

నర— అదేమిటీ, మీరస్తమానూ కిటికీలోంచి చూస్తారు ?

లక్ష్మిం— ప్లీడర్ గారిల్లుకేసి చూస్తున్నాను. సుభద్ర అయిదు నిమిషాలైంది లోపలికెళ్లి. సత్యవతి రాదేమోనని భయపడుతున్నాను. [తనలో] చచ్చు సుభద్రలెద్దూ! ఆరువందల రూపాయలు ఏ వెధవకో ధారపోస్తుందట! [సంతోషంగా] ఇదిగో సత్యవతి! లోపలికెడుతోంది చూడవే, అమ్మయ్య! ఈ పిల్లలు నా ప్రాణాలు తీస్తున్నారా నాయనా. సరే, వాడు తిన్నగా వాడి తల్లిదగ్గిరికి పొయ్యాడు. అవును గాని వీళ్ల వ్యవహారమేమీ సర్దుబాటయ్యేలా లేదంటావా ?

నర— ఏమీ లాభంలేదు. సరోజ వాణ్ణి ఒక్క నాటికి క్షమించనంటుంది.

లక్ష్మిం— [విజయ గర్వంతో] అయితే విడాకులకు తయారౌతారన్నమాట.

నర— అంతే మరి.

లక్ష్మిం— ఆఁ చూశావా ? ఈ సారి కూడా ఎవళ్లే తెలివైన వాళ్లు ?

నర— నాకు తెలియదండీ.

లక్ష్మిం— అవునులే; నేను కానా ?

నర— ఎలాగో చెప్పండి ?

లక్ష్మిం— ఇప్పుడేగా వాళ్లు విడాకు లిచ్చుకుంటారని చెప్పావ్ ? ... అప్పట్లో లోగడ మనం పిల్లపేర్న పెట్టిన ఇల్లూ, మూడువేల రూపాయలూ నాగేశ్వర్రావు సంతులుగారు అక్కడ కక్కాలన్నమాట. శెభాస్, లక్ష్మింపతీ, నువ్వేనోయ్ బుద్ధిమంతుడివి.

[ఇంతట్లో బాపనమ్మ, సీతారామయ్య వచ్చారు.]

బాప— [తలుపు తీసి తిరిగి] ఏమండీ, మిమ్మల్నే. లోపలికొస్తారా, రారా ?

సీతా— వస్తున్నానే [వచ్చాడు.]

బాప— [కూర్చోకుండానే] నిన్న అంత గొడవ జరిగాక.

లక్ష్మిం— [కొంటెగా] నాగేంద్రం పెదనాన్నగారి డబ్బును గురించికదూ?

బాప— [విననట్టు నటిస్తూ] నిన్న అంత గొడవ జరిగిన తర్వాత మళ్లీ మీ ఇంట్లో పాదం పెట్టకూడదనుకున్నాను.

లక్ష్మిం— [చేతులుజోడించి] ఆవిద్య మీచేతుల్లోనే ఉంది మహాతల్లీ !

బాప— ఆతరవాత మన పిల్లల్లో మహావైరుధ్యాలొచ్చాయి.

లక్ష్మిం— అవునవును; మహా మహా

బాప— ఆసంగతి మీకు తెలుసునన్నమాట.

లక్ష్మిం— తెలుసు.

బాప— అందుకనే నేనూ మా ఆయనాకలిసి మీ అమ్మాయిని అత్తారింటికి వచ్చి మొగుడుతో కాపరం చేసుకో వలసిందని చెప్పటానికే వచ్చాం.

లక్ష్మిం— వాడితోటా ?

బాప— అవును. అతనితోటే. మావాడు దానికోసం ఎదురు చూస్తున్నాడు.

లక్ష్మిం— ఇంకా కొన్నాళ్లు ఎదురు చూస్తూ ఉండమనండి. ఏమైనా మాపిల్ల వాడితో కాపరం చేయలేదు. కావలిస్తే తగు మనుష్యుల్ని పిలుపించుకొని రాయితం రాయించుకు వెళ్లండి. ఇంకా కావలిస్తే కోర్టులో విడాకులకు వ్యాజ్యం వేసుకోమను.

బాప— [చల్లగా] అసలు, విడాకుల అవసరమేలేదు.

లక్ష్మిం— [తెల్లబోయి] అదేమిటి ?

బాప— ఏమీ లేదు.

లక్ష్మిం— మాపిల్ల కాపరం చెయ్యనన్నా నా ?

బాప— చెయ్యనన్నా కూడా.

లక్ష్మిం— మొగుణ్ణి తన్ని తరిమి వేసినా కూడానా ?

బాప— ఆ, తరిమి వేసినా కూడా.

లక్ష్మిం— ఇకముందు ఎలాంటి కూడని పనులు చేసినా కూడానా ?

బాప— ఆ, చేసినా కూడా. విడాకులనే సమస్యేలేదు. అది చెల్లదుకూడా.

లక్ష్మిం— సీతగారో, మీసంగతి చెప్తున్నాగనక వింటాను.

బాప— మీ సంగతి కూడా చెపుతున్నాను. విడాకులు గాని, మనోవర్తి గాని మీ కేమీ అధికారాలు లేవు. నాకొడుకు, డొక్క చించి యింటికి తెచ్చుకొంటాడు.

లక్ష్మిం— యెలాంటి ఘండాలపు పనులు చేసినా సరే?

బాప— మాకేమీ నష్టంలేదు.

లక్ష్మిం— చిట్టచివరకి___

బాప— అయినా ఫరవాలేదు. [సీతారామయ్య ఏదో మాట్లాడబోగాడు] ఏమిటండీ, అది ?

సీతా— ఏమీలేదు,

లక్ష్మిం— మాకు మూడువేల రూపాయలు యివ్వవలసి వస్తుందని మీవాడి పరువుప్రతిష్ఠల్ని కూడా గంగలో కలుపుకుంటావన్నమాట.

బాప— పరువునష్టానికి మూడువేలరూపాయలు ఎక్కువ ప్రతిఫలమే.

లక్ష్మిం— నిన్న మీవాడేదో బింకాలు పలికాడు.

బాప— [మరీ చల్లగా] నాటిని ప్రస్తుతం అమలు జరపాలనుకోవటం లేదులెండి.

నర— సరోజ ఇంక ఎప్పటికీ ఒప్పుకోదని మీకు తెలియదా ?

బాప— దానికి నేనేం చెయ్యను?

నర— ఈ జీవితమంతా ఈ ఇష్టంలేని పెళ్ళి సంకెళ్లతో వాళ్ళిద్దరూ బాధపడాల్సిందేనా ?

బాప— మాకు తెలియదు. కోర్టు అమీనాను పంపి అయినాసరే మీ అమ్మాయిని స్వాధీనం చేసుకుంటాం. మావాడు రోగిష్టివాడు కాదు; మగోటి కాదు; మరోటి కాదు___మాకే?

సీతా— [తీవ్రంగా] ఇంక చాలించండి!

బాప— ఇదేమిటండీ ? మీకేదన్నా పూనిందా కర్మ ? ఏమన్నా అనదలుచుకుంటే అనండి.

సీతా— చిత్రవధ చేస్తున్నాం.

బాప— ఇంకచాలు వూరుకోండి.

సీతా— నేను వూరుకోను.

బాప— వూరుకోమంటున్నాను.

సీతా— నన్నింక వూరుకోమనకు.

బాప— వూరుకోకపోతే వురెట్టుకోండి... ఇదేమిటమ్మా, వూరుకోమంటే శివాలాడుతున్నాడీయన! (బుగ్గలు నొక్కుకుంది.)

సీతా— ఏమైనా యిది ఘోరమంటున్నాను. ఇంతకంటే మహాదారుణం మేమీలేదు. మా అన్నగారి స్థితిగతులన్నీ చెప్పేస్తానే అంటే ఎప్పుడయితే వద్దన్నావో

అప్పట్నుంచీ ఎప్పుడో ఇంతపనీ జరుగుతుందనే అనుకుంటున్నాను. నువ్వు అమ్మవారిలా మీదపడతావని నోరు మూసుక ఊరుకున్నాను. నిన్నా ఇవాళనుంచి కాదు. ముప్ఫైఏళ్లనుంచి నోరుమూసుకునే పడున్నాను. ఇంక ఊరుకునేదిలేదు; నా అభిప్రాయం కుండబద్దలు కొట్టినట్లు చెప్పెయ్య దలచుకున్నాను. ఇంతకంటే ఘోరకృత్యంలేదు. నీఇష్టంవచ్చినట్లు గింజుకో. కాని, ఇది చాలా ఘోరపాప మంటున్నాను. చిన్న పిల్లల జీవితాలతో కిరాతకపు వేషాలు చెలగాటా లాడుతున్నారు. ఇంక బుద్ధిమంతులు కలవ జేసుకోకపోతే గతులులేవు. అందుకు నేను పూనుకొంటున్నాను.

బాప— ఈయనకి ఉన్న మతికాస్తా పోయినట్టుంది; ఈయనమాట పట్టించుకోకండి.

సీతా— నోరెత్తావంటే పీక నులిమేస్తాను జాగ్రత్త. బావగారూ, నరసమ్మగారూ! నేనొక సంగతి చెప్తావినండి. కోడల్ని, మావాణ్ణీ ఏకం చేయటానికి మన శాయశక్తులా ప్రయత్నించాలి. అదే అసాధ్య మయేటట్లయితే మీరిచ్చిన మూడువేలూ ఇల్లూ మీకే వొదిలేస్తాను.

బాప— ఏదెయ్యమో పట్టినట్లుందిరా దేవుడా!

సీతా— మీసొమ్ము అణాపైసలతో మీ కిచ్చేసిన తర్వాత నేనే స్వయంగా నా కొడుక్కి విడాకుల కోసం ముందు ప్రయత్నిస్తాను.

బాప— ఇంటి కెళ్ళాక మీకు ప్రాయశ్చిత్తం జరక్క పోతుందా!

సీతా— నోరుమూసుకుని నువ్వు అవతలకి దయచెయి. తెగనీల్గావంటే పుక్కిలిరగ తంతాను. (బాపనమ్మ గుంజుకొంటూ బైటికి వెళ్ళిపోయింది.) మీరిద్దరూ బుద్ధిమంతులూ, సంస్కారం ఉన్న వాళ్ళూను. మీకు చేతనైన ప్రయత్నం మీరు చేయండి. నేను మావాణ్ణి కేకలేసి కోడల్ని బ్రతిమాలుకోమని చెప్తాను.

లక్ష్మిం— మంచిది వెళ్లిరండి. నేను కూకలేస్తాను.

నర— మీరు నిజంగా దేవుడిలాంటివారు. మీ దూరదృష్టికి సాష్టాంగ ప్రణామం చేసినా తప్పులేదు.

సీతా— (వెడుతూ) సరె కానివ్వండి, (వెళ్లిపోయారు.)

లక్ష్మిం— నిజంగా ప్రయత్నిస్తావా యేమిటి,

నర— ఏం?

లక్ష్మిం— ఆ ముసలిపీనుగ డబ్బు ఇచ్చేస్తా నంటున్నాడుగా!

నర— గత్యంతరం లేకపోతే తప్ప విడాకులికి నేను ఒప్పుకునేది లేదు.

లక్ష్మిం— నువ్వే అన్నావుగా పెం గత్యంతరం లేదని.

నర— మీకాపురం సౌఖ్యంగా ఉండాలంటే మీ చేతుల్లో ఎలాగో అలాగ సొమ్ము పడటమే కావాలి. మీకు.

లక్ష్మిం— సేసా! బాగుందే, ఆ సీతారామయ్య పాఠం నీకూ వంటబట్టిందీ?
నర— అయినా తప్పులేదులెండి.

[బాపనమ్మ మళ్లీ వచ్చింది]

బాప— మీతో రెండు విషయాలు హెచ్చరించాలని మళ్లీ వచ్చాను. ఒకటి: మా ఆయన మాటలేమీ ఖాయం అనుకోకండి. రెండవది: మళ్లీ మీ కొంప మీదికి ఒక అఘాయిత్యం తెచ్చిపెట్టు కున్నారు.
లక్ష్మిం— ఏమిటది?
బాప— మీ సుభద్ర ఆరువందలూ ఎవడి ఒళ్లో పోసిందో మీకు తెలియదను కుంటాను.
లక్ష్మిం— చిత్తం. "తెలుసుకో కౌతూహలంబయ్యెడిన్"
బాప— మీ గుమస్తా సుబ్రహ్మణ్యం గాడికి.
లక్ష్మిం— సుబ్రహ్మణ్యానికా? అబద్ధం!
నర— సుబ్రహ్మణ్యానికా?
బాప— ఏమో, మీ అమ్మాయే ఇప్పుడే నాతో అలా చెప్పింది.

[సుభద్ర వచ్చింది]

నర— ⎧ ఏమే, సుబ్రహ్మణ్యానికేనా నువ్వు ఆరువందలూ ఇచ్చింది?
లక్ష్మిం— ⎨ సుబ్రహ్మణ్యాని కిచ్చావుటే నువ్వు?
బాప— ⎩ సుబ్రహ్మణ్యానికివ్వ లేదా నువ్వు?
సుభ— ఇచ్చాను.
లక్ష్మిం— దరిద్రముండ కానా! అదేం పొయ్యేకాలమే నీకు?
నర— ఇదెక్కడ దుర్బుద్ధి పుట్టిందే నీకు?
బాప— వాడేదో చెత్తాఖానీ పుస్తకం రాశాడట, అచ్చేసుకోమని ఇచ్చిందట!
నర— అంతకంటే నీకు "నా" అన్నవాళ్లెవళ్లూ లేక పోయారా?
లక్ష్మిం— అందులోనూ నా అచ్చాఫీసుకు డబ్బు కరవేగా ఉంటోంటే?
బాప— తన మరిది దివాలాతీసే స్థితిలో ఉన్నాకూడా. నువ్వో పిచ్చివెధవ ఎదాన్ని పోసినడబ్బే ఇంకోలా వినియోగిస్తే నీచెల్లె సంసారం బాగుపడేది. అదే నీకు చెప్పాలను కున్నాను. పోతాను. [వెళ్లిపోతుంది.]
లక్ష్మిం— అలా ఎందుకు చేశావో చెప్పి సారి?
నర— ఇదేమిటే; ఏళ్లు వచ్చినకొద్దీ ఉప్పన్న బుద్ధులు పుడుతున్నాయి?
లక్ష్మిం— ఆ వెధవ ఏదో పుస్తకం రాస్తే నీకేమి ఒరిగిందే?
సుభ— ఏమీ లేదు.
లక్ష్మిం— ఆసంగతేమన్నా నీకు తెలుసా?

సుభ— తెలియదు.

లక్ష్మిం— డబ్బు ఇమ్మని ఆ వెధవ నీ కాళ్లా వేళ్లా పడ్డాడా ?

సుభ— లేదు.

లక్ష్మిం— అయితే నిన్ను పిచ్చిఆసుపత్రిలో పడెయ్యాలసిందే. నీకు మతిపోయినట్టుంది.

నర— నాకేమీ అర్థం కావటంలేదు.

సుభ— [ఏడుపులోకి దిగి] నా మనస్సు బాగాలేదు.

లక్ష్మిం— నీ మనస్సు బాగాలేదని దారిన పోయే దానయ్య ముఖాన్ని ఆరువందలూ తగలేస్తావా ?

సుభ— అతనికి విశ్వాసం ఉంటుందికదా అనుకున్నాను; అందుకని___

లక్ష్మిం— అందుకని ?

సుభ— నేనేమీ చిన్న పిల్లను కానని నాకు తెలుసు. అతనుకూడా చిన్నపిల్లాడు కాదు.

లక్ష్మిం— వాడు నిన్ను పెళ్లాడతాడనుకున్నావన్నమాట !

సుభ— అవును.

లక్ష్మిం— అయితే నీకు తెలియదా___

నర— ఊరుకోండి.

సుభ్ర— నేను ఒక్కర్తినీ బ్రతకలేను. నాకీ ఒంటరి జీవితం చాలా దుర్భరంగా ఉంది. చాలా కాలం ఆలోచించాను; నిదానంగా, ప్రశాంతంగా సుబ్రహ్మణ్యాన్ని చూశాను. అతనితో నా జీవితం సుఖంగా గడుస్తుందనుకున్నాను. డబ్బులేకపోతే అతను వివాహం చేసుకోడని తెలుసు; సరోజతో మీ సంసారం సరిపోయిందికదా, మా మరిది వచ్చాక నా మనస్సు బొత్తిగా పాడయింది. అతను సరోజతో కబుర్లు చెప్పేవాడు; నేనున్నా లేనట్టే భావించేవారు; వాళ్లిద్దరూ ముద్దుపెట్టుకొంటూండేవారు. కౌగిలింతలు, ముద్దులు — అందుకని అసూయపడక పోయినా చాలా విపరీతంగా బాధ పడ్డాను. సరే. తీరా ఆస్తి నా చేతుల్లోకి వచ్చాక, సుబ్రహ్మణ్యానికి డబ్బు కావాలని గ్రహించాక, అతనికి కొంత ఇస్తే బావుండుననుకొన్నాను.

నర— నీ అభిప్రాయమేమిటో కొంచెమన్నా అతనికి సూచించాల్సింది. అలాచేస్తే మళ్లీ నిరాశలో పడకండా బైటపడేదానివే, పిచ్చిపిల్లా.

లక్ష్మిం— నువ్వు నాతో నీ అభిప్రాయం చెప్పిఉంటే, నీవన్నీ అడియాసలని చెప్పేసేవాణ్ణి.

సుభ— ఏం ? అడియాసలేమిటి ? ఎంచేత ?

లక్ష్మిం— సుబ్రహ్మణ్యంగాడికి పెళ్లయి పదేళ్లయింది. వాడికిద్దరు పిల్లలు కూడాను. వాడెప్పుడూ చెప్పడీ సంగతులు.

సుభ– ఓ! [తలతిరిగి సొమ్మసిల్లి పోతుంది.]

నర– అయ్యయ్యో, వెర్రితల్లీ వూరుకోమ్మా.

లక్ష్మిం– చూడు, తప్పుతప్పు.

నర– ఆలా ఏడవకూడదు. కష్టాలు మనుష్యులకిరాక మానులకు వస్తాయా? [సుభద్ర వెక్కి వెక్కి ఏడుస్తుంది].

లక్ష్మిం– చచ్చుపీనుగా, సుభద్రతో చెప్తానే సుబ్రహ్మణ్యానికి పెళ్ళయిపోయిందని అంటే విన్నావా? ససేమిరా అన్నావు.

నర– చిన్నపిల్లలకి అలాంటి మాటలు చెప్తారుటండీ, ఎక్కడైనా. తీరా పెద్దయ్యాక చెప్పటం బాగుంటుందా? [సుభద్రతో] ఇంక ఏడవకమ్మా.

సుభ– [బలవంతంగా దుఃఖాన్ని దిగమింగుతూ] ఏడవటం లేదమ్మా.

లక్ష్మిం– ఇంక ఒకపని చెయ్యాలి. సుబ్రహ్మణ్యాన్ని పట్టుకొని ఆడబ్బ తిరిగి లాక్కోవాలి.

సుభ– వద్దొద్దు.

లక్ష్మిం– చూద్దాంలే [పరిగెడతాడు].

సుభ– వెళ్ళద్దనమ్మా. వెళ్ళవే. వద్దని బ్రతిమాలవే.

నర– సరేలే. [వెడుతుంది].

[సుభద్ర ఒక్కర్తే ఒక్కక్షణం వుంటుంది; ఇంతట్లో సత్యవతి వచ్చింది].

సత్య– [జాలిగా] ఆదేమే అలా వున్నావ్?

సుభ– [గాద్గదికంగా] ఏమీలేదు:

సత్య– ఫరవాలేదు చెప్పమ్మా?

సుభ– ఏమయితేనేం? అంతా అయిపోయింది.

సత్య– నాతో చెప్పవా ?

సుభ– ఏం చెప్పినా లాభంలేదింక.

సత్య– ఏమో రెవరు చెప్పగలరు? నువ్వు ఎందుకో ఏడుస్తున్నావ్.

సుభ– నేనూ, సరోజ ఒకే దౌర్భాగ్యులమని ఏడుస్తున్నాను.

సత్య– సరోజకేం?

సుభ– అది మొగుణ్ని వదిలేస్తోంది.

సత్య– ఆదేమేం!

సుభ– వాళ్ళిద్దరకీ ఇంక సఖ్యంలేదు.

సత్య– నువ్వు ?

సుభ– నేనా! [నిరాశతో క్రుంగిపోతుంది.]

[సరోజ వచ్చింది]

సరో— నీకోసమే వెదుకుతున్నాను సుభద్రా. నేను ఎక్కడికో వెళ్ళిపోతున్నాను. అతగాడు ఇక్కడికొస్తున్నాడని విన్నాను. మళ్ళా అతని ముఖం చూడాలని లేదు. అందుకే వెళ్ళిపోతున్నాను.

సుభ— ఏం చేద్దామని?

సరో— నీలాగే బ్రతకాలని. ఎక్కడో ఏబట్టల మిషను కుట్టుకునో బ్రతుకుదా మను కొంటున్నాను.

సుభ— ఎందుకని?

సరో— చావలేక బ్రతుకుదామని.

సుభ— వద్దమ్మా, వద్దు. నీకేం తెలుసు అందులో ఉన్న బాధలు!

సరో— ఏమిటి?

సుభ— ఒంటరిగా బ్రతకాల్సిన దుస్థితి నీకర్థం కాదమ్మా.

సరో— నాకేమీ ఫరవాలేదు. జంటగా బతికినప్పుడున్న దుస్థితికంటే ఒంటిగా బతికి నప్పుడున్న దుస్థితి చాలా తక్కువ. ఆసంగతి నీకు తెలియదు. పోగా వెర్రి ఆలోచనలు రాకుండా తీవ్రంగా పనిచేస్తాను.

సుభ— ఒక్కర్తిగా బ్రతుకుతూన్న ఆడదానికి పొట్టగడవటమే కాదు, అసలు గడ వటమే కష్టమమ్మా.

సరో— నీ మోహం. నీకు తెలియదు.

సుభ— ఆడదాన్ని, ఏరక్షణాలేని దాన్ని ఒంటరిగా నెడితే ఎలాంటి విషపుచూపులు చూస్తారో, ఎంత శ్లేషగా మాట్లాడతారో నీకు తెలియదు.

సరో— కనీసం నీగదిలోనన్నా నువ్వు స్వేచ్ఛగా ఉంటావ్.

సుభ— అదే స్వేచ్ఛ అయితే నాకు బానిసత్వమే నయం.

సరో— నాకు స్నేహితులుంటారు.

సుభ— వెర్రిదానా! మొగుణ్ణి వదిలేశావు కనక నీదగ్గరకి ఏ ఆడదీ రాదు. ఇంక మగాళ్ళా! మొగుణ్ని వదిలేశావు కనక ఎంత మందైనా వస్తారు కాని, ప్రపం చం ఏమను కుంటుంది?

సరో— ప్రపంచం ఏమనుకుంటే నాకేం ?

సుభ— కనీసం నీభవిష్యత్తుకోసమన్నా వెధవ సజ్జును చేరనివ్వ కూడదు.

సరో— అయితే నీ అభిప్రాయ మేమిటో చెప్పు? అతగాడిదగ్గరే పడిఉండ మంటావా?

సుభ— ఓసి వెర్రిదానా! నువ్వు కోరినంతగా నీ మొగుడు నిన్ను ప్రేమించటం లేదని కదా నీబాధ? దానికి నేను, ఏపురుషుడూ తన చేతుల్లోకి తీసుకోలేని నేను ఏమని చెప్పగలను? వ్యర్థంగా, నిరర్థకంగా అసంపూర్ణంగా ఏకాకిగా బ్రతికే నేను నీకేమి చెప్పగలను? తాను ప్రేమించటానికి, తాను క్షమించటానికి. ఎవరూ

లేని ఆడదాని జీవితం కంటే ఎడారి ఏముంది? ఆడది ఒంటిగా ఉండంటే ప్రపంచం కన్ను కొడుతుంది. ఆడవాళ్ళ ఒంటరి జీవితం ప్రపంచానికి ఆట వస్తువే. నమ్ము నామాట. ఇవాళ నాసొమ్మును. నా చేతుల్లో నేను ధార పోసుకొన్నానని నాచుట్టూ గాఢాంధకారం భయంకరంగా తాండవం చేస్తోంది.

సరో— (నిట్టూర్చి) ఓసి వెర్రిదానా!

సుభ— నీకు నామీద జాలేస్తోంది, అవునా? నాకథ పూర్తిగావింటే మరీ మంచిది. ఓదార్పుకోసం మతనిష్ఠలోకి దిగాను. నా ప్రేమని అదే కొంతకాలం దగా చేయ గలిగింది. హృదయం కాలిపోతూన్న కొద్దీ ఎంత రామ రామా అను కున్నా శాంతి ఎలావస్తుంది చెప్పు. నా భవిష్యత్తు ఎండిన మోడులా నాముందు నిలచి నన్ను కాల్చుకు తినటం ప్రారంభించింది. భరించలేక పోయాను. ఒక్క ఆఖరి ఆశతో నెలల తరబడి కుమిలి పోయాను. ఒక్క పెద్దమ్మని నేను. (ఏడుస్తూ) నాదుస్థితి నాకు తెలుసు. నేడు ఈ వయస్సులో ఇలాంటి సామాన్యమైన బట్టల కింద—నా బ్రతుకు ఎంత కనిష్టంగా ఉందో నీకు తెలియదు. నేను ప్రేమలో పడ్డాను. నాబుద్ధి పాడైపోయింది. నా తెలివి తెల్లారింది. ఎంతో బాధపడ్డాను. నాకు తెలుసు సుబ్రహ్మణ్యం నన్ను ప్రేమించ డని. అయినా విశ్వాసమున్నా ఉండకపోతుందా అని భావించాను. ఆక్కలి చేర్చుకునే దిక్కులేక వాడి విశ్వాసాన్ని వాడి సానుభూతినీ అర్థించాను. నమ్ము నామాట. యెప్పుడో అతనికి పెళ్లయి పోయిందని ఇప్పుడు తెలుసు కున్నాను. (ఆగి) ఇదే నిజమైతే ఒకలోభి తన ధనాన్ని దాచుకొన్నట్టే నా ప్రతిష్ఠని దాచుకోవటం వల్ల ఏమి లాభం పొందాను? సరూ, నామాట విను. మళ్ళీ ఇంకొకసారి నీజీవితాన్ని పాడుచేసుకోకు. నీకు భర్తతో కాపరం చెయ్యాలని లేకపోతే పోనీ, కాని నాలా బ్రతకాలని అనుకోకు. నాజీవితం నీకు మళ్ళీ వద్దు. మనలో ఒకళ్లు ఇలా అయ్యారు చాలు. నీపొట్ట నువ్వు పోషించుకో గలనని అనుకోకు. మగాళ్లు అలాంటి జీవితాల్ని చాలా అవ మానించారు.

సరో— నాఅంతట నేను ధైర్యంగా సాహసంగా నీలా బ్రతకాలని నిశ్చయించు కున్నప్పుడు నాజీవిత ప్రతిష్ఠ ప్రజల్ని నన్ను గౌరవించేలా చేస్తుంది.

సుభ— అలాంటి ప్రతిష్ఠ ఉందని ఎవరూ నమ్మరు.

సరో— అయితే అంతకంటే ఘోరంలేదు. తినటానికింత తిండి, కట్టుకోటాని కోక బట్ట, తలదాచుకోటాని కొక కొంపా ఇచ్చినంత మాత్రాన నేను అసహ్యించు కొనే భర్తదగ్గర శవంలా పడుండటంకంటే, నన్ను ప్రేమించే వాడికి దాసినై ఉండటం మంచిది. నన్ను నేనే ఎవరికో అమ్ముకోక తప్పనిసరయితే, అకొనే వాణ్ణే నేను ఎన్నుకుంటాను.

సత్య— నీకు పిచ్చెత్తి నట్టుంది. నామాటవిని నీభర్త దగ్గిరే ఉండిపో. అదేసుఖం.

సరో— ఎవరు చెప్పినా అంతేనా! ఏమైనాసరే నేను ఒప్పుకోను.

సత్య— అయితే త్వరలోనే నీ పెళ్లిజీవితమో, సుభద్ర దుఃఖ జీవితమో మళ్లీ శరణవుతుంది.

సరో— [అసహ్యంతో] అలానా!

సత్య— [తీవ్రంగా] నువ్వే మంటున్నావో నీకు తెలియటంలేదు. నీ ఇష్టంవచ్చినట్టు మాట్లాడు తున్నావ్. నీకేమీ తెలియటం లేదు.

సరో— నువ్వాలా చెయ్యలేదా?

సత్య— నేను అలాగే చేశాను. మళ్లీ ఆ కథ స్మరించటంకంటే చావటం నయమను కుంటున్నాను. సరూ, నువ్వంటే నాకు గౌరవముంది. నన్నేమి చెప్ప మంటావ్? నా అవమానాన్ని మీఇద్దరితోటీ చెప్పటానికి సిగ్గుపడుతున్నాను.

సరో— ఏమో, ఏమైనా నువ్వుచాలా సుఖంగా ఉన్నావ్, చాలు.

సత్య— నేను రాఘవేంద్రంతో లేచిపోయి నప్పుడు — ఆసంగతి మీకు తెలుసు నను కుంటాను—అతన్ని వాళ్లవాళ్లు తీసుకు పోయ్యారు. అతని తల్లి శోకంతో మంచ మెక్కి చావటానికి సిద్ధమయిందట. అవును! ఈకథ నువ్వుభరించలేక పోయినా నేను చెప్పాలికనుక తప్పదు; నేనీ అధఃపాతాళంలోకి ఎలా పడ్డానో నీకు తెలియాలి. నాకొక బిడ్డకూడా పుట్టింది. ఆబిడ్డను నేను పోషించుకోవాలి, అవునంటావా?—ఆసంగతన్నా నీకు అర్థమవు తుందను కుంటాను. అయితే ఎలాగ? పనిదొరికితే? పనికోసం ప్రయత్నం చేశాను. కొంతకాలం ఆగ మన్నారు. ఎలాగఆగటం? ఇదంతా నేనే నీతోచెప్పాలా భగవంతుడా! [వెక్కి వెక్కి ఏడుస్తుంది] ఆతర్వాత నేను చెప్పలేను. నువ్వే అర్థంచేసుకో సరూ! ఆమాత్రం ఊహించుకోగలవ్. ఇన్నాళ్లకి కూడా నీతో చెప్పలేక బాధపడు తున్నానంటే, ఎంత నీచానికి ఒడి గట్టానో ఆలోచించు. [ధైర్యం తెచ్చుకొని] నాలాంటి ఆడాళ్లు, పైకి తియ్యగా నవ్వుతారు. ఇనుక యెంతో సుఖంగా వున్నారనుకుంటున్నావు. నవ్వటమే మావ్యాపారం తెలిసిందా? అందుకే మాకు డబ్బిస్తారుకూడా. ఒక్కొక్కప్పుడు కూర్చుని ఈ కళ్ళునవ్వు నవ్వలేక, భోరున ఏడ్వాలనిపిస్తుంది. అవసరమైతే ఆ కొను క్కునే వాళ్ళే యెన్నుకుంటానంటావ్! మేమంతా యెన్నుకుంటున్నామనే అనుకుంటున్నావా? యీ ప్రపంచమే మా రక్తాన్ని తోడే యీప్రపంచమే మమ్మల్ని రొత్తుసంగా శాశిస్తుంది. కొందరు కొడతారు; రక్కుతారు— నానా హింసా చేస్తారు. ఇష్టాయిష్టాలకి ఎక్కడా చోటులేదు. మాకు స్నేహితులు గాని, జాలిచూపే వాళ్ళుగాని, సానుభూతిగానిలేదు. మమ్మల్ని దోచుకునే వాళ్ళే; కొరుక్కుతినేవాళ్ళే నిజం సంగతి చెపుతున్నాను. అర్థంచేసుకుంటా వని చెపుతున్నాను. ఒకసారి పతనం ప్రారంభమయిందా దానికింక అడుపల లేదు. అదీ నా జీవితం; నాలాంటి ఆడవాళ్ళ జీవితం అది. ఈ మురికి కూపం

లోనే సుమారు ఎనిమిదేళ్ళు కొట్టుకున్నాను. నామాటవిను తల్లీ. అంతనీచం, అంతిఘోరం, అంత దారుణం ఇంక లేదమ్మా.

సరో— అంత బాధపడ్డావా అక్కా— ?

సత్య— తెలిసిందా చెల్లీ ?

సరో— తెలిసింది.

సత్య— [నిలబడి] నేనింక వెళ్ళిపోతున్నాను. నాకథ యావత్తూ మీముందు చెప్పు కున్నాను కనుక ఈ జన్మలో మళ్ళీ మీముఖం చూడలేను. నాకు తెలుసు మీకు నా అవసరం ఎప్పుడూ ఉండదని. నేను ప్రేమకోసం పరితపించాను. మీరు—కనీసం సుభద్ర అయినా నాకోసం ఏడవకపోతుందా అనుకున్నాను. ఏమైనా నేనే పొరపాటు పడ్డాను. నేను చేసిన పాపాలకి నన్ను మీరిద్దరూ క్షమించండి. ఇంక నేను వెళ్ళిపోతాను.

సుభ— అక్కా—! [సత్యవతి వెనక్కి తిరిగింది]. నిన్నుచూస్తే నా హృదయం కరిగి పోతోంది. [ఆగి] ఒక్కసారి [వెళ్ళి సత్యవతి పాదాలు కళ్ళకద్దుకొంటుంది]

సత్య— [లేవనెత్తి] తప్పమ్మా నాతల్లీ !

[లక్ష్మింపతిగారమ్మాయిలు ముగ్గురూ ఒకర్నొకరు కావలించుకున్నారు. అందరి కళ్ళంటా అశ్రువులు రాలుతాయి. ఇంతలో లక్ష్మింపతి, నాగేంద్రం, సీతారామయ్యా వచ్చారు.]

నాగే— [తండ్రి ముందుకు గెంటితే తూలి, సరోజతో] అయిపోయిందేదో అయిపోయింది. దానికి నన్ను క్షమించు.

సరో— మిమ్మల్నే నన్ను క్షమించమంటున్నాను. నాకేదో పిచ్చిపిచ్చి ఆలోచనలు ఎక్కువగా ఉండేవి. వివాహమనేది ఇంతకంటే ఇంకోలా ఉంటుందని ఆశిం చాను. ఇప్పుడు నేనూ కొంత మారిపోయ్యాను. ఎవరైనా కొంత ఉదారంగా ఉండక తప్పదు. ఇంక నేనూ అంతే.

లక్ష్మిం— అద్భుతం !

నాగేం— ఆఖరికి నన్ను అర్థం చేసుకోగలిగినందుకు చాలా సంతోషంగా ఉంది. ఇవాళనే మనకు నిజంగా పెళ్లయినట్టులెఖ.

సరో— కావచ్చు.

నాగేం— మనం ఇలా సుఖంగా కలుసుకున్నందుకు సంతోషంగా విందుచేద్దాం. కప్పగంతులవార్నీ; తాళ్లబండి వార్నీ, ఆంజనేయుల్నీ—

సరో— [విషాదంగా, భావగర్భితంగా] తప్పకుండా ఆంజనేయుల్ని.

లక్ష్మిం— అమ్మాయిలూ మీరుకూడా ప్రపంచంలోని నలుగురితో బాటూ నారాయణా కులంతో పాటు గోవిందా అనటం నాకు చాలా సుదానవహంగా ఉంది.

సరో— (తాపీగా) అవును నలుగురితో బాటే. అంతకన్నా ఏదో సాధించాలని ఉబలాగన్నాను. చివరికి అది అసాధ్యమై పోయింది. నలుగురుతో బాటు వాళ్ళు వెళ్ళితో సమానమన్నారు.



# కళాకేళీ ప్రచురణలు, శామల్‌కోట.

○ బానిసల దేశం : సోమసుందర్ [6] 1—0—0

"...ప్రతీకథలోను ఒక ప్రత్యేకత రచయిత చూపించాడు. సమాజం లోని వ్యక్తిగత వ్యత్యాసాల్ని వర్గాల పక్షపాతాన్ని, బ్రతుకు తెరువుల సంగ్రామాన్ని చిత్రిస్తూ మన నిత్య జీవితంలో మనం చూసే జీవితాల్ని అతి నగ్నంగా ప్రతిబింబింప జేశాడు. అందుకే ప్రతీకథలోనూ వాస్తవికత ఉట్టిపడుతుంది." —ఉమ.

○ త్వమేవాహం : ఆరుద్ర [5] 0—12—0

"...పుస్తకం భావస్ఫోరకమైన ముఖచిత్రంతో ముచ్చటగా ముద్రితమైంది. కావ్యాలను పాత్రోచిత ఛందోరీతుల్లో నాటికల్లా రచిస్తాడు ఆరుద్ర. వైజ్ఞానిక సూత్రాలను, శాస్త్ర సూత్రాలను, సాహిత్య సూత్రాలకు సామరస్యం కలిగిస్తూ, వాటిలో సామ్య తత్వాన్ని సాహితీమంతంగా ప్రబోధిస్తాడు. ఆరుద్ర ఒకవిశిష్టమైన

ద్రష్ట. అగ్నుద్ర కావ్యసంపుటికి ఆంధ్రసాహిత్యంలో ఒక విశిష్టస్థానం ఉంటుందని భావిస్తాను.”

—మిస్టర్ పి. ఆర్. పి ఫ్రాంసిస్ ఎమ్. ఏ. AIR మద్రాస్.

○ శిథిలాలయం & బూట్సు : చిన్నా [4] 0—12—0

“ప్రయోగార్హమైన రెండు నాటికలు. మానవసమాజంలో ఉన్న మాలిన్యాన్ని, బూటకాన్ని, కుళ్లునూ యథాతథంగా, కళాసంపన్నంగా చూపిస్తుంది శిథిలాలయం. బూట్సు నామసార్థక్యాన్ని కథాసృష్టిలో, పాత్రపోషణలో, రంగ నిర్మాణంలో హృదయభేదకమైన దృశ్య ప్రదర్శనంలో నిర్ధారిస్తూ, సైనిక నిరంకుశపాలనా వాతావరణాన్ని ధ్వనింపజేస్తాడు రచయిత. ఇలా రెండునాటికలూ నాట్యకళాసంపన్నం కాగలిగి చక్కని విప్లవ ప్రబోధాన్ని కలిగిస్తున్నాయి.” Mr. ఫ్రాంసిస AIR మద్రాసు.

○ కళ్లుసరుకు : చిన్నా [8] 0—8—0

“...ఈ నాటకం సిఫిలిస్ వ్యాధిని ఆధారంగా తీసుకొని వ్రాయబడింది. ఇలాంటి నాటకాలు ఆంధ్రులకు చాలా క్రొత్త. దీనివల్ల ప్రయోజనం ఎంతైనా ఉంది. జీవితంలోని ప్రమాదాలేవో ముందుగానే తెలుసుకోవటంవల్ల విజ్ఞులైనవారు ఆ ప్రమాదాలనుంచి తప్పుకోగలుగుతారు. అంతకన్న సాధించగలిగిన దేముంది?”

—అభిసారిక సంపాదకీయంలో ధనికొండ.

○ విగ్రహం : చిన్నా [2] 0—4—0

“...ఒక్కమాటలో చెప్పాలంటే ‘విగ్రహం’ వెనుచూపు చూసే వారికి ఒక దుస్స్వప్నం. ఆశావాదికైన మానవ చరిత్రకారుడికి నేటి చైతన్య నిరూపణ.” —మధుపం.

అనామకులు : జోగిరాజు [7] 1—0—0

కామవ్యాపారంకోసం ఒకతల్లిబిడ్డను చేరదీసి, ఆమెను వినియోగించుకొని, ఆమె అవసరం తీరగానే ఆమెజీవితాన్ని ఒక పెద్దమనిషి ఎట్లా నాశనంచేశాడో విశదీకరించే ఉత్తమనాటకం.

అప్పగింత : ఈరంకి [9] 1—8—0

ఒకస్త్రీని ఆమెకు తెలియకుండానే ప్రేమించి ఆమెకోసం తన జీవిత సర్వస్వాన్నీ వృథాగా అర్పించిన ఒక అసమర్థప్రేమికుని జీవితగాథ.

సంజదీపం : పూషా [11] 1—0—0

హృదయాన్ని కుదిపి కవ్వించి నవ్వించే ఎన్నో అపూర్వ సంఘటనలు. ఒక్కొక్క కథ ఒక్కొక్కరకపు మనస్తత్వానికి ఉండీలు దెబ్బ.

లక్ష్మింపతిగారి అమ్మాయిలు : రాంపా [10] 1—0—0

పెళ్లిళ్లు జరుగుతాయి. ఆపెళ్లిళ్ళల్లో పెద్దలు పెత్తందారీతనం వహిస్తారు. పెళ్లిఅంటే ఎందుకో అర్థంకాని పిల్లల జీవితాల్ని తీసుకొని వాళ్లఇష్టమొచ్చినట్టు చెలగాటాలాడే పెద్దల దుర్మార్గాన్ని దుయ్యబట్టే ఉత్తమ సాంఘిక నాటకం.

వజ్రాయుధం : సోమసుందర్ [3] 1—0—0

ఈకావ్యసంపుటి నిషేధింపబడింది.

కామేశ్వరికథ : రాంపా [1] 1—4—0

ఈ ఉత్తమ నవల మొదటి ముద్రణ అయిపోయింది.

వెంటనే మాపెద్ద కేటలాగుకై వ్రాయండి.

---





బార్రి రచనలలోకల్లా గొప్ప సందేశ కళాసంపన్నమైన రచన ఇదేనని ఖచ్చితంగా చెప్పగలం. వర్తమాన అసమ ఆర్థికవ్యవస్థలోని వైవాహికదుర్గతిని దుయ్యబట్టిన ఈ రచనని రాంపా అనువదించారు. ఈయన కాకినాడ తాలూకా వేటపాలెం గ్రామంలో 30 జూలై 1924వ సంవత్సరంలో జన్మించాడు. శామల్‌కోట హైస్కూలు, కాకినాడ కాలేజీలలో అక్షరాభ్యాసం. మాటలో మంచితనం తేనిగుణం. విమర్శలో దిట్ట. నవల, కథ అనే వీరి వ్యాసాలు వీరికి అశేషఖ్యాతిని ఆర్జించి పెట్టినవి. సాహిత్యమీమాంస ఈయనకి అభిమానవిషయం.

బార్రి.





వీరి "[illegible]" అనతికాలం లోనే విమర్శకుల [illegible] పొందింది. అయితే పాఠకులకు [illegible] ఇదొక అపూర్వ [illegible] ఈయన కళాశాఖ పరిశోధక శాఖలో [illegible] ముఖ్యనిర్వాహకుడు.



రాంపా.

LUXIMPATI GARI AMMAILU

One Rupee

10th KALAKE PUBLICATION

[illegible] at *Lakshmi Printing Press, Pithapuram.*